# స్త్రీ విముక్తి

## నూతన సిద్ధాంతం



స్త్రీ విముక్తి : నూతన సిద్ధాంతం

ప్రతులు : 1000

రచయిత : మల్లాది సుబ్బమ్మ



ప్రచురణ : 1988

ప్రచురణ కర్తలు :
**మల్లాది పబ్లికేషన్సు**
9, ఎం.ఐ.జి. హెచ్. కాలనీ,
మెహిదీపట్నం, హైదరాబాద్-500 028.

ప్రతులకు :
**వికాసం**
9, ఎం.ఐ.జి.హెచ్. కాలనీ,
మెహిదీపట్నం, హైదరాబాద్-500 028.
ఫోను : 35429

**వెల : రూ. 6-00**

ముద్రణ : లక్ష్మీ ప్రింటర్స్, ఖైరతాబాద్, హైదరాబాద్-4.

# సమాలోచన - సమగ్ర వ్యూహం

"We can buy degrees but not wisdom" అన్నట్లు చట్టాలు చేయగలం, కాని ఆచరణలో పెట్టటం అసాధ్యం. అదే స్త్రీల పట్ల జరుగుతున్న మాత్రకం. భారత స్త్రీని దేవత అన్నారు కొందరు. బానిస అన్నారు ఎందరో! కాని ఆమెను మనిషిగా చూడలేకున్నారు అందరూ. అనాదిగా స్త్రీ ఒక కూపస్థ మండూకంలా పడి ఉండడానికి పురుష ప్రపంచం శాశ్వతంగా సమాధిగోడలు నిర్మించింది. స్వేచ్ఛా సమానత్వాలకు నోచుకోని మనిషి ఎవరని ప్రశ్నిస్తే మన మహిళే అనే సమాధానం వస్తుంది. అదే విధంగా కుమారి శతకం లాంటివి బట్టీ పట్టించి మాతృదేవత, గృహ లక్ష్మి, పతివ్రతలాంటి పదాలకు తాత్పర్యం చెప్పి స్త్రీని తన మంచి చెడులాలోచించకుండా చేసింది. స్త్రీలు శక్తిస్వరూపిణులు అంటూనే దూషిస్తోంది. పూజనీయులంటూనే బానిసలను చేసింది. మాతృదేవతలంటూనే మసిపూసి మభ్యపెట్టింది. వేశ్యలుగా అమ్ముతున్నది. కట్నాలకోసం చంపుతున్నారు. మానభంగాలు చేస్తున్నారు. ఎన్నని చెప్పాలి? ఎవరికి చెప్పాలి? ఎలా చెప్పాలి? మరెలా పరిష్కరించాలి? అసలు మన మెక్కడికి పోతున్నామో అర్థం కావడంలేదు. ఇది పురోగమనమా? తిరోగమనమా? అనాగరిక దశకు సోపానమా? అనేవి ఆలోచనీయాంశాలు అయినాయి. ఈ విష సంస్కృతి నిర్మూలనకొక ఎత్తుగడను, వ్యూహాన్ని నిర్మించుకోవాలి. అందుకు అనుగుణమైన మార్గాన్వేషణను అన్వేషించాలంటే స్త్రీల ఈ పతనానికి, పరిస్థితికి కారణ భూతాలైన లేక దోహదం చేసిన అంశాలను పరిశీలించి నూతన విముక్తి సిద్ధాంతాన్ని ప్రతిపాదించాలి. సమాజం, పురుష ప్రాధాన్యత కలిగి పురుషాధిపత్యం క్రింద కొనసాగటం, శ్రమశక్తికి విలువ ఇవ్వని జమీందారి విధానం, పెట్టుబడిదారి విధానం రెండూ కొనసాగటం, ఇంచుమించుగా మతాలన్నీ పురుష ప్రాధాన్యంగా వుండి స్త్రీలకు విధులు బాధ్యతలు నిర్ణయించి పురుషదాస్యాన్ని ప్రబోధించడం, తరతరాల ఆమె

బానిసత్వ ప్రచారం, ఈ బోధలకు తలవొగ్గి స్త్రీలోకం ఆత్మన్యూనతా భావాన్ని పెంపొందించుకోవడం, ఆచారాలు, సాంప్రదాయాలు పురుష నిర్మితమై స్త్రీలను కించ పరచడం, వారిని ఇబ్బందుల పాలుచేయడం, శాసనాలు, నిబంధనలు, నియమాలు పురుష ప్రతిపాదితమై స్త్రీలకు అన్యాయం జరగడం, స్త్రీ విమోచనోద్యమాలు సక్రమ మార్గాన సాగకపోవడం జరుగుతున్నది. ఇటీవల వరకూ పురుష ప్రయత్నాలకు స్త్రీలు దోహదంచేస్తూ వుండటమే తప్ప ఏనాడూ తమకోసం తాముగా కృషిచేయలేదు. అన్ని సంఘాలవలె మహిళా సంఘాలు కూడా రాజకీయ కారణాలను పురస్కరించు కొని వేరువేరుగా వుండడం సంభవిస్తున్నది. ఇవి మౌలికంగా స్త్రీయొక్క హోదాను నిర్ణయించే అంశాలు.

ఇతర అంశాలు లేక ద్వితీయశ్రేణి అంశాలు కొన్ని వున్నాయి. పిల్లలేమి, స్త్రీ చేసే ఇంటిపనికి విలువ లేకపోవడం, పురుషాధీనపు జీవితం, తన ఆస్తిపై, తన సంపాదనపై తనకు యాజమాన్యం లేకపోవడం ఉద్యోగంలో, పని తాలూకు శిక్షణలో వేతనాలలో వివక్ష, మాతగా సమాజానికి ఆమెచేస్తున్న సేవకు అనుగుణంగా ఆమెకు గౌరవాభిమానాలు ప్రాప్తించకపోవటం, ఇంటా బైటా బండెడు చాకిరితో విశ్రాంతిలేక సాంస్కృతిక కార్యకలాపాలలో పాల్గొనలేకపోవడం, సమాజాన్ని రాజకీయాలు ఎంతగానో ప్రభావితం చేస్తున్న ఈకాలంలో రాజకీయాలకు ఆమెను దూరంగా వుంచటం లాంటివి కొన్ని మచ్చుతునకలు.

పై అంశాలు పరస్పర ఆధారితాలు ఇవన్నీ కలిసి స్త్రీల హోదాను న్యూనత పరిచాయి. వీటిలో ఏ ఒక్క అంశం మాత్రమే మెరుగుపడినంత మాత్రాన పరిస్థితి బాగుపడదు. ముఖ్యంగా మౌలికాంశాలన్నీ మార్పుకు లోను కావలసి వస్తాయి. కొద్దికొద్ది మార్పులతో స్త్రీ జీవితం మెరుగుపడటం అసాధ్యమవుతుంది.

స్త్రీల ఈనాటి పరిస్థితిని గమనించాం. ఆ స్థితికి కారణభూతాలైన అంశాలను గుర్తించాం. దోహదంచేసే అంశాలను కూడా పేర్కొన్నాం. ఈ స్థితి ఎందువల్ల సంభవిస్తున్నదో తెలుసుకున్న మనకు పరిస్థితిని మార్చాలనే కోరిక కలుగుతుంది. అదే

జాగృతి. తరవాత సంఘటిత శక్తితో సమాజాన్ని మార్చాలని ప్రయత్నం చేస్తాం. సంఘటనారీతులు, ఉద్యమ స్వభావాలు, పోరాట మార్గాలు వీటి అన్నింటిని గురించి తెలిస్తేనే వాటి ద్వారా స్త్రీ విముక్తిని పొందగలం.

అది సంఘ సంస్కరణగాని, మత సంస్కరణగాని, రాజకీయ సంస్కరణ గాని స్త్రీ జనాభ్యుదయాన్ని వాంఛించే ప్రాతిపదికమీద సిద్ధాంతీకరించే ఉద్యమం ఇంతవరకూ పుట్టనేలేదు. వరకట్న నిర్మూలనమంటూ, సహగమన నిషేధమంటూ, బాల్య వివాహ నిషేధమంటూ, విధవా వివాహమంటూ చిన్నచిన్న సవరణలు, సంస్కరణలు తప్ప సంపూర్ణమైన స్త్రీ స్వేచ్ఛా సమానత్వాలమీద నొక్కిచూపే ఉద్యమం కాని, సిద్ధాంతం కాని, కార్యక్రమం గాని నేటివరకూ ఊహించనే లేదు. స్త్రీ విముక్తి కొరకు సమూలమైన మార్పులను అన్వేషించనే లేదనేది నగ్నసత్యం.

ఈ దేశంలో ఎందరో సంస్కర్తలుద్భవిల్లారు. మరెందరో మత ప్రవక్తలున్నారు; మరెన్నో సంస్కరణోద్యమలు పుట్టాయి. ఇంకెన్నో రంగాలలో మౌలికమైన మార్పులు జరిగాయి. కాని ఏనాడూ, ఏ వ్యవస్థా పూర్తిగా స్త్రీ విమోచనను సాధించిన దాఖలాలు లేవు. అసలు స్త్రీ సమస్యలు కేవలం స్త్రీలకే పరిమితం కావు. అవి సమాజానికి, సాంఘిక జీవనానికి సంబంధించినవి కాని కల్పనా ప్రపంచంలోనివి కానే కావు.

అసలు ఒక సాంఘిక సమస్యను పరిష్కరించాలి అంటే ఆ సమస్య ఎప్పుడు పుట్టింది, ఎలా పుట్టింది, దానికి మౌలికమైన కారణమేమిటి, సాంఘిక దుష్టశక్తులు ఏవి, అవి ఎలా పరిణమం చెందాయి, దానికి కారణాలేమిటి అని పరిశీలిస్తే ఆ సమస్యా పరిష్కార మార్గం సమస్యలోనే ఇమిడి ఉంటుందని తేలుతుంది. సమస్య యొక్క సమగ్ర పరిశీలన సమస్యా పరిష్కారానికి దారి చూపుతుంది. దీనినే అసలయిన దృక్పథం అని చెప్పాలి. ఆ దృష్టితో సమాలోచనచేసి ఒక సమగ్ర వ్యూహాన్ని రూపొందించటానికి చేసిన కృషి ఫలితమే నా ఈ నూతన స్త్రీ విమోచన సిద్ధాంతం.

ఇంతకు ముందు కొన్ని సిద్ధాంతాలుద్భవిల్లినా అవి కొంతవరకు మాత్రమే, కొన్ని రంగాలలో మాత్రమే స్త్రీ విముక్తిని సూచించాయని నా భావం అలాగే నా యీ నూతన సిద్ధాంతాన్ని కూడా మార్చి మరొకరు మరో సిద్ధాంతాన్ని సృష్టించవచ్చు. అలా విమర్శించే హక్కు, మరొకటి సూచించేహక్కు అందరికీ ఉంది. ఎవరి మార్గాలు వారివి. ఎవరి ఆలోచనలు వారివి. ఆ దృష్టితో సృష్టించినదే యీ నూతన స్త్రీ విముక్తి సిద్ధాంతం. దీనిని సహృదయంతో చదివి, సద్విమర్శ చేయగలరని ఆశిస్తున్నాను.

నా యీ కృషికి తమ సహాయ, సహకారాలందించిన నా జీవిత భాగస్వామి, హేతువాది, మానవవాది, పౌరహక్కుల ఉద్యమ సమన్వయ కర్త అయిన ఎం. వి. రామమూర్తి గారికి నా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

# స్త్రీ విముక్తి - నూతన సిద్ధాంతం

ప్రపంచ వ్యాప్తంగా స్త్రీల స్థితి సంతృప్తికరంగా లేదు. కొన్ని దేశాలలో స్త్రీలకు పురుషులతోపాటు సాంఘిక సమానత్వం లభిస్తే మరికొన్ని దేశాలలో వారికి రాజకీయపరంగా సమానత్వం ప్రకటించబడింది. కొన్ని ప్రాంతాలలో ఆర్థిక సమానత్వం సిద్ధిస్తే మరికొన్ని ప్రాంతాలలో సాంస్కృతిక సమానత్వం కొరవడింది. ఏ రకమైన సమానత్వమూ, స్వేచ్ఛ మహిళలకు ఇవ్వని సమాజాలు కోకొల్లలుగా వున్నాయి. వారిని జీవంతో తొణికిసలాడే వస్తువులుగా పరిగణించడం పరిపాటయింది. ఇలా తరతమ భేదాలున్న జాతులు, తెగలు, ప్రజాసముదాయాలు లెక్కకు మిక్కుటంగా ఉన్నాయి. ఈ స్థితి న్యాయసూత్రాల ప్రకారం నింద్యం, ప్రజాస్వామ్య సిద్ధాంతాల ప్రకారం పరిహరణీయం. మానవజాతికి విలక్షణమైన హేతుయుత ఆలోచనా ధోరణికి వ్యతిరేకం; నైతిక విధానానికి విరుద్ధం. ఈ పరిస్థితి ఇలా కొనసాగితే అసంతృప్తి, అశాంతి, అలజడి ఉద్భవించక తప్పదు.

ఆదిమ కాలానికీ ఇప్పటికీ ఆలోచనలు మారాయి; ఆచారాలు పరివర్తన చెందాయి. కట్టుబాట్లు సడలినయి; శాసనాలు ప్రగతిపథంలో పయనించాయి. కాని మౌలిక దృక్పథం స్త్రీపట్ల మార్పుకు లోనయిందా అనేది ప్రశ్న. వైఖరియొక్క రూపురేఖలలో తేడాలు వచ్చినయి. అంతే. ఈ అంశాన్ని సాకల్యంగా తరచి చూడటం అవసరం.

ఈ అంతరాన్ని గమనించాలంటే ఆదిమ సమాజపు ధోరణిని ఆధునిక సమాజపు పోకడను ప్రక్కప్రక్కన విశదీకరించి పోల్చిచూడటం ఒక పద్ధతి. ఈ విధానాన్ని అనుసరించి సమస్యను అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించటం అవసరం. ఆనాడు స్త్రీ పురుషుని అధీనంలో ఉన్న వస్తువు. వస్తువుకు కోరికలు ఉండవు; సంకల్ప వికల్పాలు ఉండవు. ఈనాడు మహిళ ద్వితీయశ్రేణి మానవవ్యక్తి. ఆనాడు ఆమె సంపాదన అతని ఆస్తి. ఈనాడు ఆమె సంపాదనపై పెత్తనం అతనిది. పూర్వం వంటపని ఆమె కర్తవ్యం; ఇపుడుకూడా—చరహంమీద—వంటపని లేక ఇంటిపని ఆమె బాధ్యతే. ఆమెను ఆ రోజుల్లో అబలగా చిత్రించారు; ఈ కాలంలో ఆమెను కుసుమ కోమలగాత్రిగా అభివర్ణించి గృహిణిగా ఆమె స్థానాన్ని పదిలపరిచారు. అపుడు ఆమె

తనకోసం, తన కుటుంబంకోసం శ్రమించేది; ఇపుడూ అదేపద్ధతి. శ్రమ ఆమెకు తప్పటంలేదు. కాగా ఎలాంటి శ్రమ చేయాలి, ఎవరి ఆజ్ఞానుసారం శ్రమించాలి, శ్రమ చేసే తీరును ఎవరు నిర్ణయించాలి, శ్రమ ఫలితం ఎవరికి దక్కాలి అనే అంశాలలో ఆమె ప్రమేయంలేదు. ఆమె ఆడది. ఆమె ఉన్నత వృత్తులలో, ఉన్నత స్థానాలలో ప్రజ్ఞాపాటవాలు ప్రదర్శించటం ఆమెకూ సమాజానికీ మంచిది కాదు. ఇదీ ఈయుగంలో కూడా ప్రబలంగా ఉన్న ఆలోచనా ధోరణి. సమాజంలో కుటుంబంలో ఆమె స్థానం తక్కువది. కనుక ఆమె చేసే పనికూడా తక్కువదే. ఆడమనిషి చేసేపని ఆడపని. అలాంటి ఆడపనిని పురుషుడు చేయపూనడం న్యూనత. వివాహం ఆమె జీవితధ్యేయం తొలి సమాజపుదినాల్లో. ఆ పరిస్థితి మారలేదు ఇప్పటికీ. సమాజపు అవసరాల పేరుతో ఆమె సంతానవతి విధిగా కావాలిట. కుటుంబంలో ఆనాడు ఆమె బానిస. ఈనాడు భర్త, భర్తబంధుగుల కీలుబొమ్మ. ఆ పరిస్థితుల్లో ఆమెకు వ్యక్తిత్వంలేదు; ఇష్టాయిష్టాలు ఉండరాదు. ఇపుడూ అంతే. కాకపోతే లాంచనంగా ఆమె అభిప్రాయాన్ని అడుగుతారు పురుషపుంగవులు—అంటే తండ్రి, అన్న, భర్త, పుత్రులు. అంతే తేడా. కాని, దానిని ఖాతరుచేయరు. సాంస్కృతికంగాచూస్తే, అపుడు ఆమె పురుషుని ఆటబొమ్మగా ఆడాలి, పాడాలి. ఇపుడు పురుషుల సమ్మతి లేకుండా సంగీత, నృత్య, నృత్త, శిల్ప, నాటక, చిత్ర, చిత్రకళా సాంస్కృతిక రూపాలను ఆమె చేపట్టరాదు. ఏదీ ఆమెకు స్వేచ్ఛ? ఏదీ ఆమెకు స్వాతంత్ర్యం? ఏదీ ఆమెకు వ్యక్తిత్వం? ఆలోచించే వ్యక్తిగా, సంకల్పం ఉన్న మనిషిగా, స్పందించే జీవిగా, అనుభూతులను ఆశించే మనిషిగా ఆమెకు అస్తిత్వం ఉందా? లేదు. ముమ్మాటికీ లేదు.

ఒకప్పుడు ఆచారం సమాజాన్ని శాసించింది. ఈనాటి సమాజంలో శాసనం ప్రజాజీవితాన్ని నిబద్ధంచేస్తున్నది. శాసనాలను చేసేది శాసనసభలు లేక రాజులు, లేక నియంతలు. శాసనసభలలో ప్రాబల్యం లేనిది శాసన నిర్మాణంపై ప్రభావం చూపలేరు ఎవరూ. అందుకు శాసనసభలో ప్రాతినిధ్యం అవసరం అందరికీ. స్త్రీల విషయం వేరే చెప్పనక్కరలేదు. అయితే ప్రాతినిధ్య సంస్థలలో స్త్రీల సంఖ్య అత్యల్పం. ఏదయినా జనాభాలో వారి దామాషాకు తగినట్లుగా లేము; ఉండనివ్వరు. కంటితుడుపుగా, అలంకార ప్రాయంగా ఏదో కొద్దిమందికి సభ్యత్వం కల్పిస్తున్నాము ఈనాటి సమాజంలో. రెండువేల అయిదువందల సంవత్సరాలనాడు స్త్రీలు పౌరుల క్రింద జమ వచ్చేవారు కాదు. శిష్ట సభలలో ప్రవేశం ఉండేదికాదు. రాజకీయాలు కష్టభూయిష్టాలు, కలుష

పూరితాలు, అవినీతికరాలు కనుక స్త్రీల మనస్తత్వానికి సరిపడవనిచెప్తూ అధికారాన్నంతా ఆక్రమించుకోవటం పురుషపుంగవులకు అలవాటు.

అలా ఆనాడు, ఈనాడు అధికారానికి, ఆప్యాయతకు నోచుకోక జీవితం సాగిస్తోంది స్త్రీ.

ఇంతచేసినా పురుషప్రపంచం భయసందేహాలను అధిగమించ లేక పోయింది. స్త్రీల లైంగికతపై అదుపు ఆజ్ఞలు పెట్టింది. పురుషుని కామవాంఛ తీర్చే సాధనం ఆమె ఆనాడు, ఇపుడుకూడాను. ఆమె లైంగిక జీవితంపై పెత్తనం పురుషుడిది. ఆమె సంతానంపై అధికారం ఆమె భర్తది. సమాజంలో ద్వంద్వనీతి విలయతాండవం చేస్తున్నది. లైంగిక విషయాలలో అతనికి సంపూర్ణస్వేచ్ఛ; ఆమె పరాధీన జీవితం. భర్తకు ఆమెను విధేయురాలిని చేసింది సమాజం. భార్యకు విధేయుడుగా అతడు ఉండనవసరం లేదు. నిజానికి భార్యాభర్తల మధ్య విధేయతకు చోటులేదు. పరస్పర ప్రేమాభిమానాలు, ఆప్యాయత, విశ్వాసం వారిమధ్య నెలకొనాలి. కాని సమాజం అప్పుడూ, ఇప్పుడూ పురుషాధిక్యతతో, పురుష దురహంకారంతో సాగిపోతున్నది. ఇది వాంఛనీయమా? కాదు. కానేరదు.

స్త్రీల స్థితిని కొంత స్థూలంగా పరికించిన తరువాత దీనికి కారణం ఏమిటి అనే ఆలోచన స్ఫురిస్తుంది. స్త్రీ భర్తచేత, కుటుంబంచేత, శాసనాలవల్ల, మతం పేరుతో పెత్తనంసాగించే మతాచార్యులవల్ల, అజ్ఞానాంధకారంలో మూఢవిశ్వాసాల ప్రాబల్యంతో జీవితం సాగించే సమాజ దౌష్ట్యంవల్ల మహిళ పురోగతి కుంటుపడుతున్నది. ఇంకా నిశితంగా ఆలోచిస్తే ఇవన్నీ రెండు వర్గాలక్రింద జమకాబడవచ్చు. ఒకటి పురుష ప్రపంచం. రెండవది సమాజం. మొదటిదానికి పురుష దురహంకారం, పురుషాధిపత్యం లక్షణాలు. రెండవదానిలో సామాజిక, ఆర్థిక, రాజకీయ దోపిడీ కన్పిస్తుంది.

సమాజ దౌష్ట్యంవల్ల స్త్రీ పురుషులిద్దరూ బాధపడుతున్నారు. ఇద్దరికీ స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, సామాజిక న్యాయం, వ్యక్తిత్వం కొరవడుతున్నాయి. కనుక వాటి విషయాల జోలికి పోతే గ్రంథం పెరుగుతుంది. ఒక్క అంశం మాత్రం చెప్పక తప్పదు. సమాజంలో పై అంశాలవారీగా స్త్రీ పురుషులందరికీ న్యాయం జరగాలంటే ఇరువురూ కలసికట్టుగా పని చేయాలనేది స్పష్టం. అయితే ఇక్కడ మరో అంశాన్ని నొక్కిచెప్పక తప్పదు. సమసమాజ స్థాపన చెయ్యాలంటే, న్యాయ సమా

జాన్ని నెలకొల్పాలంటే కేవలం పురుషుల ప్రయత్నాలు చాలవు. స్త్రీల తోడ్పాటు కావాలి. స్త్రీలను మనుష్యులుగా పరిగణిస్తేనే వారి తోడ్పాటు వస్తుంది. లేకపోతే అది రాదు; ఒకవేళ బలవంతంమీద సంపాదించినా అది ఇచ్ఛాపూర్వకం కాదు కనుక దాంట్లో ఊపు, బలం, త్యాగశక్తి, పట్టుదల లోపిస్తాయి. ఫలితం ఆశాజనకంగా ఉండదు. ఎలా ఆలోచించినా స్త్రీ స్వేచ్ఛ తప్పనిసరి అవుతుంది.

పురుషాధిక్యతపై నొక్కిపెట్టి స్త్రీల సమస్యలను పరిశీలిద్దాం. స్త్రీ పురుష సమానత్వాన్ని సాధించటానికి మహిళోద్యమం అవసరమవుతున్నది. దానినే "ఫెమినిజం" అంటున్నారు. సమాజావిర్భావ కాలం నుండి స్త్రీ వస్తువు, బానిస, ద్వితీయ శ్రేణి మానవి. దీనికి సమాజం కారణభూతం నిజమే. కాని తొలికాలం నుండీ సమాజంపై పెత్తనం సాగించిందీ, ఆధ్వర్యం వహించిందీ పురుషులే కదా! వారు స్త్రీని ఎందుకు తక్కువ చూపు చూశారు? చూస్తున్నారు? ఇదీ కీలక సమస్య. వారికి అలా ఉండటం లాభం కనుక అనేది స్ఫురించక మానదు. పురుషజాతి స్వార్థం స్త్రీ స్వేచ్ఛను ఆమోదించనీయలేదు. అదీ కారణం. దీనిని సరిగా అవగాహన చేసుకోవటానికి ఒకటి రెండు ఉదాహరణల పరిశీలన ఉపయుక్తమవుతుంది. భూస్వామ్య ఉత్పత్తి విధానంలో, పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యవసాయ కూలీలుగ, కార్మికులుగా స్త్రీ పురుషులు పనిచేస్తున్నారు. ఇద్దరూ దోపిడీకి గురి అవుతున్నారు. వారి శ్రమఫలితం వారికి దక్కటం లేదు. కాని స్త్రీ సంపాదన, ఆదాయం పురుషుడు కాజేస్తున్నాడు. ఆమె శ్రమ ఫలితం ఆమెకు దక్కటం లేదు. సహకారానికి మారుపేరుగా మనవలసిన కుటుంబంలో పురుషుడు స్త్రీని దోపిడీ చేస్తున్నాడు. ఇది పచ్చి నిజం. మరొక ఉదాహరణ తీసుకుందాం. పెట్టుబడిదారీ సమాజంలో నిరుద్యోగం తప్పనిసరిగా ఉంటుంది నిరుద్యోగులు తగిన సంఖ్యలో ఉంటేనే ఆ వ్యవస్థకు లాభం. అయితే నిరుద్యోగుల స్త్రీలా పురుషులా అనేది ఆ వ్యవస్థకు ముఖ్యం కాదు. ఆమాటకు వస్తే నిరుద్యోగుల పురుషులైతేనే వ్యవస్థకు లాభం. వ్యవసాయ రంగంలో, గృహ నిర్మాణం లాంటి వ్యాపారాలలో స్త్రీలకు తక్కువ వేతనాలు ఇస్తారు. కనుక ఎక్కువ వేతనాలు ఇవ్వాల్సిన అవసరం తగ్గుతుంది పురుషులు నిరుద్యోగులయితే. కుటుంబ పరంగా ఏం జరుగుతున్నదో పరికిద్దాం. భార్యకు ఉద్యోగం వచ్చి, భర్త నిరుద్యోగి అయితే భర్త సహించలేడు. స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్నందు వల్ల పురుషులకు ఉద్యోగాలు పోతున్నాయని వాపోతాడు; గగ్గోలు పెడతాడు. ఆందోళనకు దిగుతాడు. అందరికీ ఉద్యోగాలు రావాలని, అందరికీ పని కావాలని ఆందోళన చేస్తే మంచిదే. అలా చేయడు. స్త్రీ

మీద విసుక్కుంటాడు; కసురుకుంటాడు. స్త్రీజాతిని నిందిస్తాడు; అవమానిస్తాడు. ఇదా విప్లవ తత్వం! ఇదా తిరుగుబాటు ధోరణి! కాదు. పురుషాధిక్యతా భావం వారి నరనరాన జీర్ణించటం వల్ల, సంకుచిత మనస్కులై, దూరదృష్టి లేక వారు అలా సంచరిస్తున్నారు. వారిని నయాన, భయాన, సంకుచిత స్వార్థానికి దూరం చేయటం స్త్రీల కర్తవ్యం. వారిలో పురుష దురంహంకారాన్ని రూపుమాపటం "ఫెమినిజం" యొక్క ముఖ్య ధ్యేయం.

## కారణం

ఎందుకు వచ్చిందీ ఈ పురుష దురంహంకారం? దీనికి సమాధానాలుగా పలు తాత్విక దృక్పథాలు పెక్కు సిద్ధాంతాలు వెలువడినాయి. వాటి పరిశీలనకు ఈ ప్రణాళిక రెండవ భాగంలో పూనుకోవచ్చును. కాని మౌలిక కారణాన్ని ఇపుడు అన్వేషించ వలసి ఉంటుంది. ముమ్మందుగా కొన్ని విషయాలను ప్రస్తావించక తప్పదు. ప్రకృతి పరిణామక్రమంలో జీవం ఉద్భవించింది. పక్షులు, జంతుజాలం పుట్టాయి. జంతు ప్రపంచంలో నుండి మానవజాతి వచ్చింది. కనుక మానవునిలో జంతు ప్రవృత్తి వాసనలు ఉండటం ఆశ్చర్యం కాదు. మానవుడు ఆలోచనా జీవి. అతని మెదడు అతని ఆలోచనలకు కారణభూతమయింది. కార్యకారణ సంబంధాలను గుర్తించగలిగింది మానవజాతి. జ్ఞాపకశక్తి, ఆలోచనాశక్తి, ఊహాశక్తి, సృజనాశక్తి ఆ జాతికి అందుబాటులోకి వచ్చాయి. భాషను ఏర్పరచుకొని వృద్ధిచేసుకున్నది మానవ తెగ. ఇలాంటి మానవ జాతిలో స్త్రీ పురుషులున్నారు. ఇరురకాల వారికి మెదడు ఉంది. పైన ఉటంకించిన శక్తులన్నీ ఉన్నాయి. మరి స్త్రీ ఎందులో తక్కువ? ఎందుకు ఆమెను తక్కువగా చూస్తున్నారు? ఆమె ద్వితీయశ్రేణి మానిసిగా ఎందుకు పరిగణింప బడుతోంది!

హేతుత్వం మానవ వ్యక్తి విశిష్ట లక్షణం. కొన్ని జీవజాతులలో కూడ హేతుత్వ శక్తి కానవస్తుంది. కాని, అది చాల ప్రాథమిక స్థాయిలో ఉంటుంది. ఎక్కువగా వాసనా ప్రేరితంగా ఉంటుంది. మానవజాతి కూడ వాసనా ప్రేరితంగా సంచరించినా ఆ వ్యక్తి యొక్క ఉద్రేకాలు, వాసనలు ఎక్కువగా ఆ వ్యక్తి హేతుత్వానికి లోబడి లేక దాని ప్రభావానికి లోనయి పనిచేస్తాయి.

పరిస్థితిని కార్యంగా పరిగణిస్తే అది సంభవించటానికి అనేక కారణాలుండ వచ్చు; మామూలుగా ఉంటాయి కూడాను. అయితే ఒకటి ప్రధాన కారణమయితే

తతిమ్మావి సహాయ కారణాలుగా ఉంటాయి. ఒక్కొక్కప్పుడు రెండు ప్రధాన కారణాలు సమాంతరంగా పనిచేస్తాయి.

వేటాడే దశలో, పశుపాలన వ్యవస్థలో, కాయగూరలను ఏరుకొని బ్రతికేకాలంలో విత్తనాలు వెదజల్లి పండిన పైరును నూర్చుకొని ఆహారాన్ని సంపాదించుకునే రోజుల్లో, గుంటక త్రోలుతూ వ్యవసాయాన్ని సాగించే యుగంలో స్త్రీ పురుష అసమానత్వం లేదని, నాగలితో వ్యవసాయం ప్రారంభమయినపుడు స్త్రీ పురుష అసమానత్వం తల ఎత్తిందని కొందరి భావం. వివాహ వ్యవస్థ ఆరంభ దశలో పొడ సూపిందని మరి కొందరి ఆలోచన. కాని తరచి చూస్తే ఇంకా వెనుకకు వెళ్ళి పరిశీలించ వలసిన అవసరం కన్పిస్తుంది

మానవ జాతికి, జంతుజాలానికి ఉన్న తేడా కేవలం హేతుత్వం విషయంలోనే కాదు. మరో అంశంలో కూడా ప్రస్ఫుటమవుతుంది. అది కామతృప్తి సంబంధ విషయం. సంతానోత్పాదనకు అవసరమయిన లైంగిక కార్యానికి జంతుజాలానికి ఋతుదశ ఉంది. వివిధ జంతువులకు వివిధ కాలాలు ఋతువులుగా ఉన్న విషయం సర్వజన విదితం అప్పుడు మాత్రమే పురుష జంతువు స్త్రీ జంతువుకు దగ్గర చేరగలదు; సృష్టి కార్యాన్ని నెరవేర్చగలదు. అయితే ఇక్కడ ఒక ప్రధాన అంశాన్ని విస్మరించరాదు. ఆడజంతువు అనుమతి లేనిదే మగజంతువు దాని లైంగిక సన్నిహితత్వాన్ని పొందలేదు. మానవజాతిలో పరిస్థితి వేరు. వేరే ప్రత్యేకంగా లైంగిక సంపర్కానికని ఋతు నిర్దేశం లేదు. కాగా సంతాన ప్రాప్తికి ఋతు నిర్దేశం ఉన్నమాట వాస్తవమే. సంతాన వాంఛ వేరు, సంభోగాసక్తి వేరు. మానవజాతి విషయంలో అనాగరిక మానవుడికి సంభోగానికి, సంతానోత్పాదనకు ఉన సన్నిహిత సంబంధం స్పష్టంగా తెలియదు. కనుకనే సంతానోత్పాదన చేస్తున్న ని మంత్రగత్తెగా, అతీత శక్తులున్న మానవిగా మొదట్లో భావించాడు. కాని వాస ప్రేరితంగా స్త్రీ పురుషుల కలయికను ఆశించాడు. ఆ కలయికకు కాల నిర్దేశం లేదు. ఆంక్షలు లేవు. ఈ కలయికకు దోహదం చేసిన ఇతర అంశాలు కొన్నింటిని పరిశీలించాలి. పురుషజాతి దేహ నిర్మాణం, స్త్రీజాతి శరీర నిర్మాణం వేరుగా ఉంటాయనే విషయం అందరికీ తెలిసిన విషయమే. కాగా స్త్రీ జననేంద్రియం ఆమె శరీరంలో ఇమిడి ఉంటుంది. పురుషుని జననేంద్రియం శరీరంలో భాగమే అయినా వెలుపల, విడిగా ఉంటుంది. దాంతో దానికి కొంత స్వేచ్ఛ, చలనశక్తి ఉన్నట్లు గ్రహిస్తాము. అందచేత పురుషుడు స్త్రీకి అయిష్టమైనా ఆమెతో కలవవచ్చును. స్త్రీ అలా చేయలేదు. ఆవె

కేవలం పురుషుని సహకారం మీద ఆధారపడి సంచరించాలి. ఇక్కడ మరో అంశాన్ని మరచిపోకూడదు. సాధారణంగా స్త్రీ పురుషుల కలయిక ఇరువురికీ సమ్మతమే, సుఖ ప్రదమే, సంతోషదాయకమే; ఆనందదాయకమే. కాగా లైంగికతను నిర్దేశించేది మెద డులో భాగం కాని కేవలం జననేంద్రియం కాదు. స్త్రీకి కాముక వాంఛ ఉన్నా పురు షుడు సహకరించనిదే ఆమెకు వాంఛాఫలసిద్ధి జరుగదు. పురుషుడికి కాముకభావం ఉద యిస్తే స్త్రీ సహకారం లేకున్నా దౌర్జన్యంగా తన కోరికను తీర్చుకోగలడు అయితే అది అతనికి సుఖప్రదమా? అతనికి సంతోషదాయకమా? అతనికి ఆనందప్రదాయినియా? ఇవి వేరే ప్రశ్నలు. కాకపోవచ్చును. సాధారణంగా దౌర్జన్యపర కలయిక వల్ల అవి లభించవు. పరస్పర సమ్మతిమీద, పరస్పరా సక్తి మీద ఆధారపడిన కలయికతో ప్రారంభమయిన స్త్రీ పురుష సంబంధం కాలక్రమాన కేవలం పురుష కాముకభావ ప్రచోదితమైన కలయికకు దారి తీసింది. దీంతో మొదలయింది పురుష దురహంకార భావం. ఈ పురుష దురహంకారమే పురుషాధిపత్యానికి దారితీసింది. కనుక లైంగి కత సందర్భంగా స్త్రీ పురుష తేడాలు పురుషాధిపత్యానికి దారితీసాయని గ్రహించాలి.

ఒకసారి పురుషాధిపత్యం ప్రారంభమయి అది కుటుంబంలో, సమాజంలో, సంస్కృతీ పరంగా, రాజకీయంగా, ఆర్థికంగా స్త్రీని క్రుంగతీసింది. విధి నిషేధాలు, ఆంక్షలు, నియమాలు, నిర్దేశాలు ఆమెపట్ల అన్ని రంగాలలో వెలిశాయి. ఆమె జీవం ఉన్న వస్తువయింది. బానిసగా మారింది. అతనికి సంతానాన్ని అందించే సాధన మయింది. అతనికి విలాసాన్ని, వినోదాన్ని చేకూర్చే పనికత్తె అయింది. కాస్త దాక్షి ణ్యంతో ఆమెను చూడటం ప్రారంభించిన తదుపరి ఆమె రెండవ తరగతి మనిషి అయింది. ఏదైనా ఆమె వ్యక్తిత్వం అతనికి సర్వధా దాసోహమే అయింది.

వాస్తవానికి పురుషుడికి లేనిశక్తి స్త్రీకి ఉంది. గర్భధారణ, సంతాన ప్రాప్తి ఆమె ప్రత్యేక శక్తులు; ఆమె విశిష్ట లక్షణాలు. అంతేకాదు. ఆమె వ్యాధి నిరోధకశక్తి అతని శక్తికన్న పది శాతం ఎక్కువ. ఇంత అధికశక్తి, బలం ఉన్న స్త్రీ పురుషుడికి లొంగి ఉండటం, ఉండవలసి రావటం ఆశ్చర్యంగా కనిపిస్తుంది. కాని అలా జరి గింది జరుగుతున్నది. ఇది వాస్తవం. ఇది కాదనడానికి వీలులేని నగ్న సత్యం.

పురుష దురహంకారం ఎన్ని రూపాలుగా ప్రస్ఫుటమవుతున్నదో పరిశీలిం చటం అనౌచిత్యం కాదు. ముఖ్యందుగా స్త్రీని, స్త్రీ శరీరాన్ని, ఆమె మనస్సును అదుపులోకి తీసుకున్నాడు. దంపతీ వ్యవస్థ, వివాహ విధానం మొదలయినప్పటి

నుండి ఆమె అతని బందీ అయింది. ఆమె లైంగికతపై అతడు ఆంక్షలు పెట్టాడు. ఆమె తన కాముక భావాలను అణచి పెట్టుకోవాలి; వ్యక్తంచేయరాదు. ఆమె తన అభీష్టాన్ని తెలియజేస్తే-ఏ కారణంవల్లనైనా గానీ అతడు ఆమె కోరికను తీర్చలేని అశక్తుడయితే అది అతనికి పరాభవ కారణమవుతుంది. అందుకని అలా ఆంక్షపెట్టాడు. ఆమె శరీరం తనది. ఆమె క్షేత్రము. తన అనుజ్ఞ లేనిదే ఆ క్షేత్రములో మరొక పురుషుడు బీజవ్యాప్తి చేయరాదు. అలాంటి సందర్భంలో జన్మించిన సంతానం తనది అవుతుంది. అలాంటి కుమారులను క్షేత్రజులుగా పరిగణించింది ప్రాచీన సమాజం. తన అనుమతి ఉంది కనుక. పురుషులతో—అందుకొరకైన—కలయిక నింద్యం కాదు. అన్యధా గర్హ్యం. ఆమె తనకు సంబంధం లేకుండా, తన సమ్మతి లేకుండా పరపురుషుని కన్నెత్తి చూడరాదు. ఆమె తన కోసమే జీవించాలి. అలా చేస్తే ఆమె పతివ్రత అనే బిరుదును పొందుతుంది. ఇలా ఆమె భావాలను, మనస్సును నియంత్రణ చేశాడు పురుషుడు.

తరువాత బహుభార్యాత్వ దశలో పురుషుడు ఎంత మంది స్త్రీలనైనా పెళ్ళాడవచ్చును. కాని స్త్రీ మాత్రం ఏకభర్తృకగా ఉండాలి. తనకు ఏకపత్నీత్వం నియమం కాదు. ఈ సందర్భంలో కూడ స్త్రీ శరీరానికీ, స్త్రీ శీలానికీ లంకె పెట్టాడు పురుషుడు. ఆమె తను ధన మనఃప్రాణాలను తనకు అంకితం చేయాలి. ఏకపత్నీత్వం, ఏకపతిత్వ దశ వచ్చింది. అందులోనూ అదే భావం రాజ్యం చేసింది. ఉదాహరణకు ఇండియాలో ఇప్పటికీ ఒక పురుషుని భార్య లైంగిక సాన్నిహిత్యాన్ని పొందిన పరపురుషునిపై భర్త క్రిమినలు కేసు పెట్టవచ్చును. అంటే భార్య భర్తఆస్తి అన్నమాట. అలాగే మరొక స్త్రీతో తన భర్త వ్యభిచరిస్తే ఆమెపై భార్య కేసు పెట్టటానికి వీలు లేదు. భర్త భార్య ఆస్తి కాదన్నమాట. భర్త భార్యకు యజమానిగా ఉండే భావం ఇంకా ప్రబలంగానే ఉంది; చావలేదు. ఆమె లైంగిక జీవితాన్ని అదుపులోపెట్టే హక్కు అతనిది.

తన భార్యను పర పురుషుడు దౌర్జన్యంగా, బలాత్కారంగా మానభంగం చేస్తే ఆమెను బహిష్కరిస్తాడు పురుషుడు. అందులో ఆమె దోషం ఇసుమంతయినా లేదు అయినా ఆమె అతని సాంగత్యానికి పనికిరాని వస్తువు. భగ్నశరీరఆమె. ఇది లైంగిక యాజమాన్య భావన నుండి ఉద్భవించిన భావం.

ఆమె శీల రక్షణ పేరుతో ఆమెను భద్రపరుస్తాడు. ఇల్లాలిని చేస్తాడు. ఇంటి వెంటి వెలుపల సమాజానికి ఆమెను దూరం చేస్తాడు. ఆమె శక్తియుక్తుల వికాశానికి అడ్డుపడతాడు. ఆమెను-ఆమెకు పతివ్రతా ధర్మాలు బోధించి-గృహనిర్బంధం చేస్తాడు. ఆమెకు "అబల" అని పేరు పెట్టి ఆమెను భయభ్రాంతను చేస్తాడు. ఆమెను ఆజన్మాంతం రక్షితురాలిని చేస్తాడు.

దాంపత్య జీవితంలో భర్త భార్యతో లైంగిక సంపర్కాన్ని ఎపుడైనా పొంద వచ్చును. ఆమె సమ్మతి ఉందా లేదా అనేది అతనికి అనవసరమైన ప్రశ్న. వివాహ బంధంలో ఆమెను మానభంగం చేయడానికి అతనికి సర్వదా హక్కు ఉందట. పర పురుషుడు మానభంగం చేస్తే ఆమె నేరారోపణ చేయవచ్చును. భర్త ఆ దుర్మార్గానికి ఒడికట్టే ఆమె నేరారోపణ చేయటానికి వీలులేదు. అతని దుశ్చర్య నేరమే కాదు. ఇది అన్ని దేశాలలోనూ వర్తించే శాసన సూత్రం. దీనిని న్యాయసూత్ర మనడం శోచ నీయం. ఇండియా లాంటి దేశంలో మరో విచిత్ర స్థితి ఉంది. కోర్టు ద్వారా వేరుపడి విడిగా ఉన్న (Judicial Separation) భార్యపై భర్త అత్యాచారం చేసి మానభంగం చేస్తే అతనికి రెండేళ్ళ మాత్రమే జైలుశిక్ష. పరపురుషునికి పది సంవత్సరాల జైలు శిక్ష. ఇదంతా ఎందుకు వ్రాయవలసి వస్తుందంటే ఆమె జననేంద్రియంపై భర్తకు గల హక్కును విశదీకరించటానికి.

మరో అంశం విచారణీయం. పరపురుషుడు తన భార్య కాలు, చెయ్యి విరగ గొట్టినా, ముకు కోసినా, కన్నులు పెరకినా భర్త ఆమెను త్యజించడు. కాని ఆమెను మానభంగంచే ఆమెను వదిలివేస్తాడు. పతివ్రతాధర్మం పేరుతో ఆమె ప్రాణత్యాగం చేస్తుంది. అం ఏమిటి? శీలం అంటే కేవలం సెక్సు సంబంధముగా పురుషుడు, తదు పరి అతని బోధనవల్ల మతిని పోగొట్టుకున్న స్త్రీలు ఆలోచిస్తున్నారని తేలుతుంది.

మేలి ముసుగు, గుంగుట్, బురఖా లాంటివి స్త్రీని రక్షించటానికి పుట్టాయట! ఎవరి బారి నుండి? స్త్రీలు స్త్రీలపై అత్యాచారం చేయరే! అంటే పురుషుల నుండి అన్న మాట. పురుషుడు అంటే ఒక స్త్రీ కుమారుడు, మరొక మహిళ సోదరుడు, ఇంకొక స్త్రీ మనుమడు ఎందుకు ఇలా స్త్రీని దుర్మార్గంగా చూస్తాడు? ఎందుకు ఆమెను అవమా నించ ఉత్సహిస్తాడు? అతడు ముమ్మ పెళ్ళాడ తలిచేవాడేకదా! పురుషులు స్త్రీకి శత్రు వులు కావటం శోచనీయం. ఏదైనా ఆమె మర్మావయవానికి ఘాత కలుగుతుందనే భయంతో ఆమెను వంట ఇంటికీ, పడకటింటికీ పరిమితం చేయటం మనం చూడటం లేదా? ఉద్యోగినులను అందులో ముఖ్యంగా అవివాహితులను, వితంతువులను,

విడాకులు పొందినవారిని నిందా పూర్వకంగా మాట్లాడటం సాధారణంగా జరిగేదే. అంటే స్త్రీ ఎవరికో ఒకరికి చెందాలన్నమాట. అలా కానప్పుడు ఆమె అందరికీ అందు బాటులో ఉన్న వస్తువు. ఈ భావం పురుషాధిపత్య భావానికి ముచ్చుతునక.

సమాజ పరిణామంలో అనేక మార్పులు సంభవిస్తున్నాయి. జనాభా నియం త్రణ సామాజిక ధ్యేయాలలో స్థానం సంపాదించటంతో జన్మ నిగ్రహ సాధనాల వాడకం వ్యాప్తి చెందింది. దాంతో కేవలం సంతానం కోసమే లైంగిక సంపర్కం అనే భావన ఎగిరి పోయింది. లైంగిక సంపర్కము స్త్రీ పురుషుల సన్నిహితత్వానికి చిహ్నమయింది. లైంగిక సన్నిహితత్వం విధిగా సంతానోత్పాదనకు దారి తీస్తుందనే భయ సంకోచాలు అంతరించి పోయాయి. ఇటువంటి పరిస్థితుల్లో భార్య పరపురుషుల ద్వారా గర్భవతి అవుతుందనే భయం భర్తకు ఉండనవసరం లేదు. అయితే భార్యా భర్తలు పరస్పర విశ్వాసంతో, ఒకరి యెడ మరియొకరు నమ్మకంతో సంచరించటం న్యాయం, ధర్మమూను. ఈ విషయంలో విప్రతిపత్తి లేదు. పర పురుషుల ద్వారా తన భార్యకు సంతానం కలిగితే తను వారిని పోషించవలసి వస్తుందనే అనుమానం భర్తకు ఉండనక్కరలేదు. ఆ కారణాన్ని చెప్పి ఆమె శీలాన్ని రక్షించే బాధ్యతను తన మీద వేసుకోవలసిన అవసరం భర్తకు లేదు. ఇలా భర్త యొక్క యాజమాన్యానికి దెబ్బ తగిలింది.

కాలం మారుతున్నది. స్త్రీ పురుషులు వివేకవంతులవుతున్నారు. విద్యావంతులవు తున్నారు. జీవితానుభవం వల్ల వారి జ్ఞానం పెరుగుతున్నది. అనేక రకాల విద్యల్లో, కళల్లో, శాస్త్రాల్లో స్త్రీలు నిష్ణాతులవుతున్నారు. కనుక వారు విధిగా రక్షితులుగా ఉండాలనే వాదన బలాన్ని కోల్పోతున్నది. మహిళ తనను తాను రక్షించుకోగల శక్తిని సంతరించుకుంటున్నది. ఆమెకు జీవితకాలమంతా ఎవరో ఒక పురుషుడు సంర క్షకుడుగా ఉండాలనే ఆలోచన ఆధార రహితమవుతున్నది. అంతేగాక శీలమంటే సత్యనిరతీ, నిజాయితీ, నిస్వార్థబుద్ధి, త్యాగశీలత అనే అర్థం వచ్చింది. స్త్రీ యొక్క శీలం కేవలం ఆమె శరీరానికి సంబంధించినదిగా ఎంచడం పొరపాటని తేలిపోయింది. స్త్రీ పురుషుల మానసిక శక్తిలో తేడా గాని, బుద్ధి నైశిత్యంలో భేదం కాని ఉన్నదని శాస్త్రం రుజువు చేయలేక పోయింది. పెరిగే వాతావరణంలో తేడావల్ల, అవకాశాలలో భేదాల వల్ల ప్రజ్ఞాపాటవాలలో తరతమ భేదాలు వస్తున్నాయి కాని వస్తుతః ఒకవ్యక్తి స్త్రీ అయినంత మాత్రాన మరొకవ్యక్తి పురుషుడు అయినంత మాత్రాన బుద్ధికుశలతలో

వ్యత్యాసాలు ఉపయోగించవు. పెట్టుబడిదారులు, కార్మికులు, భూస్వాములు, రైతులు అన్నట్లుగా స్త్రీలు, పురుషులు వేరు వేరు వర్గాల వారు కారు. కనుక స్త్రీ పురుషులను వేరు వేరు వర్గాలుగా పరిగణించడం సరియైన పద్ధతి కాదు; వారికి వివిధ వర్గ ప్రయోజనాలు కాని వర్గ దృష్టి కాని ఉండదు. కాగా సమాజంలో వారు రెండు రకాల ప్రజలు; రెండు తెగలు (CATEGORIES).

## ప్రేమ, సెక్సు, నీతి

ఒకప్పుడు, పెండ్లాడిన పురుషుడితో లైంగికానుభవం నీతిగా చెప్పబడింది. ఈనాడు ప్రేమ అనే పదానికి విలువ కలిగింది. ప్రేమలేని పెళ్ళి వ్యభిచారంతో సమానంగా చిత్రించబడుతున్నది. కేవలం సెక్సు అనుభవం కోసం తహతహ లాడటం, వెంపర్లాడటం జంతు దశను అధిగమించలేక పోవటం అని కొందరు భావిస్తున్నారు. అయితే సెక్సులేని ప్రేమ అసంపూర్ణమూ, లోపభూయిష్టమూ అవుతున్నది. ప్రేమ, సెక్సు రెండూ కలిస్తేనే నైతిక సంబంధానికి దారి తీస్తున్నాయి.

## మానవజాతి లక్ష్యాలు, ఆదర్శాలు

మానవ వ్యక్తి స్వేచ్ఛను కోరటం సహజం. మానవ విలువలలో పరమోత్కృష్టమయినది స్వేచ్ఛ. అన్ని విలువల కంటె ప్రప్రథమయినది. దానిని రెండు విధాలుగా నిర్వచనం చేయవచ్చును. విరుద్ధ విషయాల పరంగాను, ప్రయోజనకరంగాను. వ్యక్తి వికాసానికి కల అవరోధాలను అంటే సాంస్కృతిక, మానసిక, సామాజిక, కౌటుంబిక, ఆర్థిక, రాజకీయ అవరోధాలను క్రమక్రమంగా తొలగించు కోవటమే స్వేచ్ఛ. వ్యక్తివికాసానికి దోహదం చేసేది, ఆనందాన్ని చేకూర్చేది స్వేచ్ఛ అని పేర్కొనడం మరొక పద్ధతి. ఎలా పేర్కొన్నా స్వేచ్ఛ యొక్క అంతరార్థం తెలిసి పోయింది. మానవ వ్యక్తి స్వేచ్ఛా పిపాసి. స్వేచ్ఛకోసం శ్రమించడంలో సత్యాన్వేషణను చేపట్టటం తప్పనిసరి అయింది. తన బంధాలు ఏమిటో తెలియనిది విముక్తిని ఆశించలేరు కదా! ప్రతి మానవ వ్యక్తి బంధాలలో జన్మించటం, పెరగటం, బంధ విముక్తి కోసం అహరహం శ్రమించడం జరుగుచున్నది.

స్త్రీలు మానవ జాతిలో సగభాగం కనుక ఈ లక్ష్యాలు, ఆదర్శాలు వారికీ ఉంటున్నాయి. వీటిని వారి జీవితాలకు అన్వయం చేసుకొని వారి డిమాండ్లను అవగతం చేసుకోవాలి.

మానవులంతా స్వేచ్ఛా సమానత్వాలను, సౌభ్రాతృత్వాన్ని, సామాజిక న్యాయాన్ని అభిలషిస్తున్నారు. అదనంగా స్త్రీలు రెండు కోరవలసి ఉన్నది. ఒకటి వివక్ష నిర్మూలన. రెండవది ఆమెకు ఏకాంతాన్ని, విశ్రాంతిని కలుగజేసే సౌకర్యాలు, సదుపాయాలు. పురుషుడు చేయలేని పనిని, చేయని పనిని ఆమెచేస్తున్నది. పిండాన్ని తొమ్మిది నెలలు గర్భంలో మోసి, శిశువును కని, దానికి పాలిచ్చి పెంచిపోషించేది స్త్రీ. సమాజం కొనసాగటానికి, మానవజాతి నశింపు కాకుండా వృద్ధి పొందటానికి ఆమె దోహదం చేస్తున్నది. ఈ ప్రత్యేకతను గమనించి ఆమెకు అవసరమైన విశ్రాంతిని, ఏకాంతతను ఆమెకు ఒనగూర్చటం పురుషుల కర్తవ్యం; విధి కూడాను.

## వ్యూహం

ఈనాడు మహిళాభ్యుదయానికి అవరోధాలుగా నిలిచేవి రెండు. (i) స్వేచ్ఛా సమానత్వాది మౌలిక హక్కులకు అడ్డంకిగా ఉన్న సమాజం.

(ii) పురుష దురంహంకారం ప్రాతిపదికగా కల పురుషాధిపత్యం.

ఈ రెంటిని నిర్మూలిస్తే తప్ప స్త్రీలు అభ్యుదయ మార్గాన పయనించలేరు.

## ఎత్తుగడలు

సమసమాజాన్ని, న్యాయమైన సమాజాన్ని నెలకొల్పే విషయంలో స్త్రీలు పురుషులతో కలసి శ్రమించటం అవశ్య కర్తవ్యం. ఇందులో ఏ విధమైన అనుమానానికి సంకోచానికి తావులేదు.

కాగా పురుషాధిపత్యం విషయంలోనే చిక్కులు వస్తున్నాయి. పురుషాధిపత్యం స్థానంలో స్త్రీల ఆధిపత్యాన్ని వారు కోరటం లేదు, కేవలం, వారు, స్వేచ్ఛా సమానత్వాది మౌలిక హక్కులను "డిమాండు" చేస్తున్నారు. అంతే.

ఇక పురుషులందరూ స్త్రీలకు శత్రువులని భావించటం పొరపాటు. పురుషులలో మూడు తెగలవారున్నారు.

(i) సంప్రదాయ బద్ధంగా వస్తున్న ఆలోచనలను, ఆచారాలను యథాతథంగా స్వీకరించి అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడే పురుషులు.

(ii) సంప్రదాయాలు, ఆచారాలు, అనాదిగా వస్తున్న ఆలోచనా స్రవంతి స్త్రీలకు కష్ట నష్టాలను కలిగిస్తున్నాయని తెలిసి కూడా తమ స్వార్థం కోసం, తాము అనుభవిస్తున్న హక్కులు, సదుపాయాలు, సౌకర్యాలు పోతాయనే భయంతో స్త్రీల ప్రగతిని నిరోధించే స్వార్థపర పురుష పుంగవులు.

(iii) సమాజ చరిత్రను సునిశిత దృష్టితో పరిశీలించి సత్యాన్ని కనుగొని, స్త్రీ జాతి పట్ల జరిగిన, జరుగుతున్న అక్రమాన్ని, అన్యాయాన్ని గమనించి, స్త్రీ జనాభ్యుదయం లేనిదే సమసమాజ స్థాపన అసాధ్యమని గ్రహించడమే కాక, మానవులందరు సమానులు కనుక స్త్రీలకు వ్యతిరేకంగా వివక్షా విధానాన్ని చేపట్టటం ఘోర దురన్యాయమని తలంచి మహిళాభ్యుదయానికి నడుం కట్టే వివేకవంతులైన పురుషులు.

పై చెప్పిన మూడురకాల పురుష విభాగాల పట్ల స్త్రీ విమోచనోద్యమకారులు, స్త్రీ స్వేచ్ఛావాదులు మూడురకాల దృక్పథాలను అలవర్చుకోవాలి. వివేకవంతులైన పురుషుల సహకారాన్ని, సహాయాన్ని విధిగా స్వీకరించాలి. స్వార్థపర పురుష "సెక్షనుల"పై యుద్ధం ప్రకటించాలి. అజ్ఞానాంధకారంలో ఉండి అనాలోచితంగా ప్రవర్తించే తతిమ్మా పురుషుల యెడ సానుభూతితో నడుచుకోవాలి. వారిని ప్రబోధ కార్యక్రమాల ద్వారా తమవైపు మళ్ళించుకోవాలి; కనీసం తటస్థులనుగా చేయాలి. ఇలా చేసిననాడు స్త్రీ స్వేచ్ఛా ఉద్యమపు పోరాటం సుగమమవుతుంది.

## కార్యక్రమం

స్త్రీ విమోచనోద్యమకారులు, స్త్రీ స్వేచ్ఛావాదులు చేపట్టవలసిన కార్యక్రమాన్ని స్థూలంగా సూచించడమైనది. వివరాలతో సమగ్రమైన కార్యక్రమాన్ని రూపొందించటానికి వలసిన వ్యవధీ, కాలమూ ప్రస్తుతం కొరవడుతున్నాయి. దీనిని స్థూలంగా సాంస్కృతికమని, లైంగికమని, సామాజికమనీ, కౌటుంబికమని, ఆర్థికమని, రాజకీయమని పలు విభాగాల క్రింద పేర్కొనడం సమంజసం.

## సాంస్కృతికం

(1) స్త్రీ మానవ వ్యక్తి కనుక ఆమె పురుషునితో సమానురాలు.

(2) ఆమెను వస్తువుగా, బానిసగా, లేక రెండవ తరగతి మనిషిగా పరిగణిం చడం తప్పు.

(3) మానవ జాతిలో ఒక వ్యక్తి మరొక వ్యక్తిని సాధనంగా వినియోగించుకో రాదు కనుక అలాగే స్త్రీని పురుషుడు తన ఇష్టసిద్ధికి సాధనంగా వాడుకో వటం క్షంతవ్యం కాదు

(4) స్త్రీ పురుషులు పరస్పరం ఆధారపడి జీవించే మనుష్యులు. అయితే ఈ సూత్రం పేరుతో పురుషాధిపత్యానికి పట్టం కట్టటం న్యాయం కాదు.

(5) భావ స్వాతంత్ర్యానికి, భావ ప్రకటనా స్వాతంత్ర్యానికి స్త్రీకి హక్కు ఉండాలి.

(6) విద్యా సముపార్జనకు, సమాజపు సాంస్కృతిక కార్యకలాపాల్లో ఆవె పాల్గొనటానికి ఆమెకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉండాలి.

(7) ప్రస్తుతం ఆమె చేస్తున్న గృహ నిర్వహణకు, ఆమె మాతృత్వ నిర్వహ ణకు చేస్తున్న కృషికి, శ్రమకు పరిగణన కావాలి.

(8) ఆమెకు అసౌకర్యం కలుగని రీతిలో, ఆమె యెడ ఏ విధమైన వివక్ష అన్ని రంగాలలో తొలగాలి. ఆమాటకు వస్తే ఆమె ప్రత్యేక విధులన నెరవేరుస్తున్నది. అవి మాతృత్వం, సమాజ పునరుత్పత్తి. ఆమెకి అనుకూలమైన వివక్ష సమాజంలో రూపొందాలి. అంతేగాక తరతరా నుండి ఆమె వివక్షకు గురి అవుతూవచ్చింది. కనుక ఆమెకు అనుకూలంగా ఉండే వివక్షను కొంత కాలం ప్రవేశపెడ్తే తప్ప సమాజంలో స్త్రీ పు షుల సమతుల్య స్థితి, సమానత్వం సిద్ధించదు. అందుకని ఆమెకు అ కూలమైన వివక్షను సమాజంలో నెలకొల్పటం అన్యాయం కాదు.

## లైంగికం

స్త్రీ పురుషులందరికీ వర్తించే సెక్సు సూత్రాలను కొన్నింటిని మానవవాద వి వలను ప్రాతిపదికగా తీసుకొని నిర్ధారించడం జరిగింది. వాటిని స్త్రీల యొక్క ప్రత్యే పరిస్థితులను పరిగణనలోకి తీసుకొని వారి పట్ల అన్వయించటం అవసరం.

(1) సెక్సు విషయంగా స్త్రీని నిర్బంధించటానికి, దౌర్జన్యానికి గురి చేయటానికి ఎవరికీ—భర్తకు కూడా—ఏ విధమైన హక్కూ లేదు. ఆమె స్వేచ్ఛాయుత సమ్మతి లేనిదే ఆమెను ఏ పురుషుడూ పొందరాదు.

(2) ఎప్పుడు, ఎవరితో, ఏ శరీర భాగాలతో, ఎక్కడ ఆమె లైంగికానుభూతిని పొందాలో నిర్ణయించే అధికారం ఆమెకు ఉండాలి.

(3) స్త్రీల వ్యక్తిత్వ వికాసానికి భంగం అయ్యే రీతిలో—అంటే వ్యభిచారం, మరొకరిని హింసించటం, మరొకరిచేత హింసింప చేసుకోవటం—తప్ప ఇతరత్రా లైంగికానుభూతి రూపాలను నిర్దేశించుకునే హక్కు ఆమెదే.

(4) మతమూ, సమాజమూ, రాజ్యమూ ఆమె లైంగిక జీవితాన్ని శాసించ పూనరాదు.

(5) సంతానాన్ని కనాలనా అక్కరలేదా, కంటే ఎంతమందిని ఎప్పుడు కనాలి అనే నిర్ణయాధికారం ఆమెది కావాలి.

(6) గర్భస్రావపు హక్కు పూర్తిగా ఆమెదే.

(7) అయితే ఆమె లైంగిక జీవితం విషయంలో బాధ్యతాయుతంగా, హేతుబద్ధంగా సంచరించాలి. భౌతికానందం, శారీరక సుఖం నైతిక విలువలుగా గుర్తించినంత మాత్రాన వాటి విషయంగా ఆమె స్వైర విహారం చేయ పూనటం ఆమె మానవత్వ లక్షణానికి విరుద్ధం.

లైంగికానుభూతి సందర్భంగా ఆమె రెండు దృక్పథాలను అలవరుచుకోవాలి. ఇవి ఇతరులను గుర్తించి శ్రద్ధ వహించటం, వారిని గౌరవించటం అనే సూత్రాలపై ఆధారపడి ఉన్నాయి. (i) "నా యెడలను, నేను శ్రద్ధవహించే వారి యెడలను ఇతరులు ఎలాంటి లైంగిక ప్రవర్తనను ప్రదర్శించాలని నేను కోరుకుంటున్నాను." (ii) "నా యొక్క ఆనందం, శ్రేయస్సుల యెడ నేను ఎంతగా శ్రద్ధ వహిస్తున్నానో అలాగే లైంగిక సంపర్కంలోని భాగస్వామి యొక్క తదితర వ్యక్తుల యొక్క యోగ క్షేమాలకు నేను అంతగా ప్రాముఖ్యం ఇస్తున్నానా?" ఈ రెండు ప్రశ్నలకు ప్రతి స్త్రీ, పురుషుడు వేసుకొనివాటికి సమాధానాలను తెలిసికొని తగు రీతిలో తమ నడవడిని నిర్ణయించుకోవాలి.

(8) వివాహేతర పూర్వ లైంగిక జీవిత విషయంలో స్త్రీల ప్రవర్తనపై ఆంక్షలు ఉండరాదు.

(9) వృద్ధులకు, వికలాంగులకు ఇత్యాదులకు కూడా లైంగిక జీవితం పట్ల ఆసక్తి ఉంటుందని గ్రహించాలి.

(10) సంతానోత్పాదనను గురించిన, జన్మనిగ్రహ సాధనాల గురించిన సాంకేతిక పరిజ్ఞానం స్త్రీలకు అందుబాటులోకి రావాలి.

(11) అన్నింటికన్న మిన్న, స్త్రీ పశుదశలోకి జారిపోకుండా, సుసంపన్నమైన అర్థవంతమైన లైంగిక జీవితాన్ని పొందడానికి తద్వారా మానవిగా ఉన్నతోన్నత సాంస్కృతిక శిఖరాలను అధిరోహించటానికి సమాయత్తం కావాలి.

## కౌటుంబికం

కుటుంబం సమాజంలో భాగం. ఒక రకంగా ఆలోచిస్తే సమాజానికి కుటుంబం నమూనా. కుటుంబ పరంగా స్త్రీల హక్కులను గురించి పరిశీలిద్దాం.

(i) వివాహమాడటానికి, లేక కన్యగా ఉండటానికి స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛ ఉండాలి. ఆచారం పేరుతో, స్త్రీధర్మం పేరుతో ఆమెను వైవాహిక దశలోకి నెట్టటానికి ఎవరికీ హక్కు లేదు.

(ii) 18 సం॥లోపు వయస్సుగల స్త్రీలకు పెళ్ళి చేయటానికి తల్లిదండ్రులకు, అన్నదమ్ములకు, అక్కాచెల్లెళ్ళకు, తదితర సంరక్షకులకు ఎవరికీ హక్కు లేదు; ఉండరాదు.

(iii) వివాహమయిన తదుపరి ఆమె భర్త ఇంటిలో లేక అత్తమామల ఇంటిలో విధిగా కాపురముండాలనే నియమం పోవాలి. అది ఆమె నివాసానికి సంబంధించిన హక్కు. ఆమె, ఆమె జీవిత భాగస్వామి పరస్పర సంప్రతింపుల ద్వారా తేల్చుకునే విషయం. దాని సందర్భంగా బంధువులకు సమాజానికి, న్యాయస్థానాలకు ఎట్టి ప్రమేయం ఉండరాదు.

(iv) ఆమె తన భార్య కనుక, తనకు ఒక్కసారే ఆమె లైంగిక సంపర్కానికి అనుమతిని ఇచ్చిందనే వాదనతో, ఆమె సమ్మతి లేకుండా భర్త ఆమెను లైంగికంగా వాడుకోవటానికి ప్రయత్నించడం, దానిని సమాజం, న్యాయ శాస్త్రం ఆమోదించడం గర్హ్యనీయం. భర్త అయినా సరే, ఆమెపై అత్యాచారం జరిపి గాని దౌర్జన్యంగా గాని, ఇతరత్రా గాని ఆమె సమ్మతి లేని పరిస్థితిలో ఆమెను లైంగికంగా అనుభవించడం నైతిక సూత్రాలకు విరుద్ధం. అక్రమం, అన్యాయం. దీనిని స్త్రీలు నిరసించాలి, అరికట్టాలి.

న్యాయస్థానాల ద్వారా ఉత్తరువు పొంది విడిగా ఉన్న భార్యపై (JUDICIAL SEPARATION) భర్త మానభంగం (RAPE) చేస్తే అతనికి తక్కువ శిక్షను నిర్దేశించడం పొరపాటు. అలాంటి స్త్రీని ఇంచు మించుగా విడాకులు పొందిన స్త్రీతో సమానంగా పరిగణించాలి. ఆమెను ఇతర స్త్రీల స్థాయిలో లెక్కకట్టాలి.

(v) మాతృత్వం, గర్భస్రావం లాంటి విషయాలలో భర్త భార్యను శాసించరాదు.

(vi) భార్య సంపాదనపై, ఆస్తిపై, ఆదాయంపై—ఆమె స్వేచ్ఛాయుతమైన సమ్మతి లేకుండా—భర్త యాజమాన్యం వహించరాదు; అధికారం చెలాయించరాదు.

(vii) ఆమె చేసే ఇంటి పనిలో, వంటపనిలో భర్త భాగస్వామ్యం పంచుకోవాలి. ఆమె కృషిని, శ్రమను ఆ సందర్భంగా పరిగణించి గౌరవించాలి.

(viii) కుటుంబ యజమానిగా తనే ఉండాలని భర్త పట్టు పట్టరాదు; సమాజం, శాసనం అలా అతనినే గుర్తించరాదు. పరస్పర సంప్రతింపుల ద్వారా భార్యాభర్తలిరువురు ఆ విషయమై ఒక నిర్ణయానికి రావాలి.

(ix) పిల్లల సంరక్షకత్వం వస్తుతః ఆమెదిగా ఉండాలి. వారిని ఆమె సంతానంగా సమాజం, న్యాయస్థానాలు, శాసనాలు గుర్తించాలి. విద్యాలయాలు, కార్యాలయాలు, కర్మాగారాలు, జనాభా లెక్కలు వగైరాలలో ఫలాని పిల్ల, ఫలాని పిల్లవాడు, ఫలాని స్త్రీ సంతానమని వ్రాయాలి. వాస్తవానికి తల్లి ఎవరో నిర్ధారణ తేలిక. ఇది ప్రత్యక్ష ప్రమాణం. తండ్రి ఎవరనేది

తల్లి చెప్పిన సాక్ష్యాన్ని బట్టి, ఇతర సాక్షిసాధకాలను బట్టి తేలుతుంది. ఇది అనుమాన ప్రమాణంపై ఆధారపడుతుంది.

(x) దంపతుల మధ్య అభిప్రాయ భేదాలు వచ్చినపుడు తమ దాంపత్య జీవిత రహస్యాలను న్యాయస్థానాలలో బహిరంగ పర్చటం ఇష్టం లేని భార్యా భర్తలలో ఏ ఒకరయినా తమకు విడాకులు కావాలని కోరి వెంటనే పొంద వచ్చును.

## మనోవర్తి హక్కు

(xi) దంపతులలో ఒకరు రెండవవారి నుండి మనోవర్తిని కోరినప్పుడు మాత్రం రెండవ వారి దుశ్చర్యలను నిరూపించవలసి ఉంటుంది. అపుడు కోర్టువారు ఆ పరిస్థితులకు అనుగుణంగా మనోవర్తి చెల్లించమనే ఉత్తరవును జారీ చేయగలరు.

## వివాహబంధం వెలుపల లైంగిక సంబంధం

(xii) దంపతులలో ఏ ఒక్కరైనా అపరలి వారి సమ్మతితో లేక ఉదాసీనతతో మరొక పురుషునితో కాని, స్త్రీతో గాని లైంగిక సంబంధం ఏర్పరచుకో వచ్చును. అది వారి ముగ్గురికి సంబంధించిన విషయం. దానిలో ఇతరుల ప్రమేయం అనవసరం సమాజం, శాసనం, సంప్రదాయం ఈ సంద ర్భంగా జోరబడ వీలు లేదు. కాగా జీవిత భాగస్వామి సమ్మతి లేకుండా అలాంటి లైంగిక సంబంధం ఏర్పడితే దంపతులలో ఆ పరిస్థితిని ఇచ్ఛ గించనివారు విడాకులను పొందవచ్చును. అంతేకాని తదితరులపై అంటే భార్యపై గాని, భర్తపై గాని, లేక మూడవ వ్యక్తిపై గాని క్రిమినలు చర్యలకు దిగటానికి వీలులేదు. అలాగే సివిలు చర్యలకు దిగి పరిహారం కోరరాదు.

## భార్య స్వేచ్ఛలు

(xiii) స్త్రీ యొక్క సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక స్వేచ్ఛను అరికట్టటా నికి భర్తకు వీలులేదు. ఇష్టం లేకపోతే ఆతడు ఆమె నుండి విడిపోవచ్చును.

## హింస

(xiv) భర్త భార్యను శారీరకంగా, మానసికంగా దండించి, హింసకు లోనుచేసి, ఆమెపై అత్యాచారం జరపటం నింద్యార్హం.

ముఖ్యమైనవి పేర్కొనబడినవి. ఇంకా వివరంగా అనేకం పేర్కొనవచ్చును.

## సామాజికం

(i) సామాజిక జీవితంలో పాల్గొనడానికి స్త్రీకి గల హక్కును ఎవరూ నిరాకరించడానికి వీలులేదు.

(ii) ఆమెపై వేర్పాటును, ముసుగును విధించడానికి ఎవరికీ హక్కు లేదు. ఆమె ఆహార విహారాదులపై, నివాసంపై, వస్త్రధారణపై ఎవరూ ఆంక్షలు విధించరాదు. సభా స్వాతంత్ర్యం, సమావేశ స్వాతంత్ర్యం ఆమె జన్మహక్కు.

(iii) వారసత్వం, దత్తత, సంరక్షత్వం లాంటి విషయాలలో ఆమె పట్ల వివక్షను తొలగించాలి.

(iv) వరకట్న దురాచారం సమసిపోవాలి.

(v) దేవాలయాలలో, మత సంస్థలలో, ధార్మిక సంస్థలలో ఆమె ప్రవేశాన్ని, ఐక్యాన్ని నిషేధించరాదు.

(vi) కన్యను, వివాహితను పొందిన స్త్రీని, వితంతువును ఎవరికీ చెందని ఆస్తిగా పరిగణించి ఆమెను పొందగోరే మనస్తత్వాన్ని నిరసించాలి.

(vii) స్త్రీల వేధింపును, స్త్రీలపై అత్యాచారాలను, స్త్రీలను చికాకుపరిచే అశ్లీల సాహిత్యాన్ని, దాని ప్రచారాన్ని అరికట్టాలి.

(viii) ఉద్యోగాలలో తక్కువ పనులు తెచ్చేవి, తక్కువ ఆదాయాన్ని ఇచ్చేవి, తక్కువ అధికారాన్ని సమకూర్చేవి, శ్రమకల్గేవి, విసుగు జనింపచేసేవి వీటిని స్త్రీలకు కేటాయిస్తున్నారు. ఈ పద్ధతి పోవాలి. అన్ని వృత్తులలో ఉద్యోగాలలో ప్రవేశింప స్త్రీలు అర్హులు.

(ix) స్త్రీ యొక్క వ్యక్తిత్వాన్ని గుర్తించాలి.

(x) స్త్రీకి అనుకూలంగా, విద్యారంగాలలో, ఉద్యోగ రంగంలో వివక్షను కల్పించాలి.

## ఆర్థికం

(i) స్త్రీ నిర్వహిస్తున్న మాతృత్వ పాత్రను గుర్తించి దానిని ఆమె నిర్వహించటానికి వలసిన సదుపాయాలను, సౌకర్యాలను ధన రూపంగా, విశ్రాంతి రూపకంగా, సెలవుల ద్వారా అమర్చాలి.

(ii) స్త్రీలకు ప్రత్యేకంగా కావలసిన ఏకాంతతకు (PRIVACY) వలసిన ఏర్పాట్లను సమాజం తన ఖర్చుపై కల్గించాలి.

(iii) ఆమెకు ఉద్యోగ భద్రత ఇవ్వాలి.

(iv) ఆమెకు ఆరోగ్య వసతిని కల్పించాలి.

(v) స్త్రీ పురుషులు సమానమైన పనిని చేస్తున్నపుడు, సమానమైన బాధ్యతను నిర్వహిస్తున్నపుడు వారి జీతాలలో, వేతనాలలో, కూలీలో వ్యత్యాసం ఉండరాదు.

(vi) శ్రమ కాలాన్ని, శ్రమలోని నైపుణ్యాన్ని పరిగణించాలి. శ్రమ రీతులు వేరైనా వివక్ష ఉండరాదు.

(vii) ఉద్యోగాలలో, పనిలో శ్రమను నైపుణ్యాన్ని బట్టి "ప్రొమోషన్లు", శిక్షణావకాశాలు ఉండాలి. అంతేకాని స్త్రీల యెడ వివక్ష పనికిరాదు.

(viii) ప్రభుత్వ సహాయ కార్యక్రమాల్లో అంటే భూముల పంపిణీ, స్థలాల పంపిణీ, ఋణాల పంపిణీ ఉచితంగా గాని, వెసులుబాటుతో కాని జరిగినప్పుడు స్త్రీలను నిరాదరణచేసి కుటుంబయజమానిగా పురుషుని పేర్కొని అతనికి మంజూరు చేయటం జరుగుతున్నది. ఆ పద్ధతిని మార్పుచేసి ఇరువురి పేర సమష్టిగా గాని, లేక ఇరువురికి చెరిసగంగా గాని ఇవ్వాలి.

(iv) విద్యా, ఆరోగ్య, వైద్య, గృహవసతి, ఉపాధికల్పన, విశ్రాంతిని కల్పించుట, వృద్ధాప్య పింఛను వగైరా విషయాలలో స్త్రీల పట్ల ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని సాగే వివక్షను నిర్మూలించాలి.

## రాజకీయం

(1) వోటు హక్కు:- ఇప్పటికీ కువైటు లాంటి దేశాలలో స్త్రీలకు వోటుహక్కు లేదు. వోటు హక్కు స్త్రీల జన్మహక్కు.

(2) రాజకీయంగా స్త్రీల వోటు హక్కును గుర్తించిన దేశాలలో కూడా స్త్రీల యెడ వివక్ష సాగుతున్నది. రాజకీయ పార్టీలలో, సంస్థలలో, ప్రాతినిధ్య సంస్థలలో స్త్రీల సంఖ్య బహు స్వల్పం. వారి ప్రాతినిధ్యం అతి స్వల్పం. ఈ పరిస్థితి మారాలి.



(3) నాయకత్వం:- రాజకీయ సంస్థలలో, ప్రభుత్వ ఉద్యోగాల్లో, ప్రభుత్వాల్లో, న్యాయస్థానాల్లో స్త్రీల సంఖ్య అత్యల్పం. ఈ స్థితి సమాజానికి శుభప్రదం కాదు. సమాజమనే దేహంలో ఒక భాగం చచ్చుబడితే దేహం ఎలా పని చేస్తుంది? ఇలా సాగితే సమాజ పురోగతి కుంటు పడుతుంది. అపుడు అవకాశాలు నిరాకరింపబడిన స్త్రీలు ప్రగతి పథంలో సంచరించవలసిన పురుషప్రపంచాన్ని ముందుకు సాగనీయరు. ఇది ప్రమాదకరం. అన్ని రంగాల్లో పురుషులు సమాన భాగస్వాములు కావాలి.

(4) శాసన సభలు:- శాసన సభలలో స్త్రీలపై హింస, అత్యాచారాలు లేక స్త్రీలకు వలసిన రక్షణ చర్చకు వచ్చినపుడు అక్కడ సమావేశమయిన పురుష ప్రతినిధులు చర్చను అపహాస్యంలోకి దిగజారుస్తారు, నవ్వులాటలు వ్యవహారం క్రిందికి జమకట్టారు. సమస్యను శ్రద్ధగా పరిశీలించరు. ఇది పురుష దురహంకార ప్రదర్శన; స్త్రీల పట్ల ఉదాసీన వైఖరిని అవలంబించటం. ఈ వైఖరిని స్త్రీ స్వేచ్ఛా వాదులు అంతం చేయించాలి.



## ముగింపు

స్త్రీ విముక్తి, స్త్రీ విమోచన, స్త్రీ స్వేచ్ఛ తేలికగా సాధించే విషయాలు కావు. మహిళాభ్యుదయానికి వలసిన కృషి శ్రమభూయిష్టం. పట్టుదల, నిరంతర జాగరూకత, అవిరళ కృషి అవశ్యం కావలసిన గుణాలు.

## ఎవరు ఉద్యమించాలి?

ఎవరయితే ఈ సమాజపు దౌష్ట్యానికి బలయి పోతున్నారో, ఎవరయితే పురుష దురహంకారానికి పాత్రులవుతున్నారో, ఎవరయితే పురుషాధిపత్యపు ఉక్కు పాదాల క్రింద నలిగి పోతున్నారో వారు-స్త్రీలు-మున్ముందుగా ఉద్యమించాలి. వారిలో జాగృతి పొందిన వారు, సాహసిక స్పృహ కల్గిన వారు, విద్యావంతులు, స్పందన శక్తిని కోల్పోని వారు, నైతిక దృష్టిని పోగొట్టుకోక సంచరించేవారు, ఆలోచనాపరులు, వివేకవంతులు తోటి స్త్రీలను మేల్కొల్పటానికి, వారిని చైతన్యవంతులను చేయటానికి పని ప్రారంభించాలి. స్త్రీ సమాజాలను సంఘటితం చేయాలి. వీలయిన సందర్భాల్లో, అవసరమయిన పరిస్థితుల్లో ప్రగతికాములైన పురుషుల సాయాన్ని తీసుకోవాలి.

ఇలా సమాజ శ్రేయస్సును, మహిళా పురోగతిని రెంటినీ దృష్టిలో ఉంచుకున్న స్త్రీలు మాత్రమే సమాజాన్ని మార్చి తమ జీవితాలను సుసంపన్నమూ, అర్థవంతమూ చేసుకోగలరు.

## నూతన సిద్ధాంతం

స్త్రీ విమోచనకు కావలసిన ఆలోచనాధోరణి, వ్యూహం, ఎత్తుగడలు, కార్యక్రమం విశదీకరించడం జరిగింది. వీటి అన్నింటివెనుక ఒక సిద్ధాంతం ఉన్నదా అనే సందేహం సహజంగా ఉద్భవిస్తుంది. ఉన్నది అని గట్టిగా చెప్పడానికి వెనుకాడవలసిన పనిలేదు.

సిద్ధాంతం అక్కరలేదనేవారూ ఉన్నారు ప్రపంచంలో. సిద్ధాంతం అక్కరలేదనేదికూడా ఒక సిద్ధాంతమే. అయితే ఒక్క విషయాన్ని విస్మరించరాదు. సిద్ధాంతాలకన్నా జీవితం వాస్తవమైనది; విలువైనది. జీవితపు లోతులను అవలోకనంచేసిన కొలది నూతన సత్యాలు గోచరిస్తాయి. నూతన సిద్ధాంతాలు మొలకెత్తుతాయి. అర్ధసత్యాలైన సిద్ధాంతాలను పట్టుకొని వ్రేళ్ళాడి లాభంలేదు. జ్ఞానం పెరుగుతున్నకొలది జ్ఞానసారమైన సత్యంయొక్క పరిధి విస్తరిస్తుంది. ఈ సత్యాల సమన్వయం నూతన సిద్ధాంతానికి చోటు కల్పిస్తుంది. ఈ జీవిత సత్యాన్ని గుర్తించడం అత్యవసరం.

ఇంటిపని, మాతృత్వం, స్త్రీ లైంగికతను అవగతం చేసుకోలేకపోవడం, ఈ మూడు స్త్రీలను క్రుంగతీస్తున్నాయని కొందరి ఆలోచన. స్త్రీని ఇంటిపనికి కేటాయిం

టడం పురుషాధిపత్య సమాజపు లక్షణం. పురుషాధిపత్యాన్ని తొలగ్రతోసి సమసమాజాన్ని నిర్మించిననాడు స్త్రీ పురుషులు ఇద్దరూ ఇంటిపనిని నిర్వహించుకుంటారు. అలాగే మాతృత్వ విషయం. ఈనాడు మాతృత్వం స్త్రీకి బాధాకరమయింది; దుఃఖ కారణమయింది. ఆనందదాయకమూ, సుఖప్రదాయిని కావలసిన మాతృత్వం ఆమెకు భర్తకు కుటుంబానికి, సమాజానికి దానిసపు చేస్తున్నది. ఇదంతా పురుషాధిపత్య మహిమయే! స్త్రీ పురుష సమానత్వం సిద్ధించిననాడు మాతృత్వం ప్రయోజనకారి, సుఖప్రదమూ అవుతుంది. స్త్రీ లైంగికతను గురించి సరియైన అవగాహన మహిళా దశాబ్ద ఆరంభంవరకు కలుగలేదు. ఇటీవల శాస్త్ర పరిశోధనలు, స్త్రీలలో పెల్లుబికిన చైతన్యం నూతన మనః కవాటాలను తెరిచాయి. జ్ఞానం కొత్త సరిహద్దులవరకు విస్తరించింది. విస్మరించబడిన స్త్రీ లైంగికతకు ప్రాధాన్యత వచ్చింది. స్త్రీ విమోచనకు సమగ్రదృష్టి ఏర్పడటానికి అవకాశం కలిగింది. అలాంటి సిద్ధాంతమే పై పుటలలో ప్రతిపాదితమయింది. కాగా దానికి నామకరణం జరుగలేదు ఇంతవరకు.

ఇపుడు ఈ సిద్ధాంతాన్ని మానవవాద స్త్రీ విమోచన సిద్ధాంతం (Humanist Feminism) అని పిలవడం సమంజసం.

## మానవవాద స్త్రీ విమోచన సిద్ధాంతపు విశిష్టత

ఈ సిద్ధాంతం వాస్తవికతపై ఆధారపడి సమగ్ర పరిశీలనవల్ల పుట్టి సమ్యక్ దృక్పథంతో దాసిల్లుతుంది. సంతానోత్పాదన విషయంలో స్త్రీ శక్తి సంపన్నతను గుర్తిస్తుంది. దానిని ఆమె బలహీనతగా గుర్తించదు. కుటుంబ పెంపుదలకు, సామాజిక శాశ్వతత్వానికి ఆమె చేసే అపూర్వ సేవగా లెక్కలోకి తీసుకుంటుంది. కనుక ఆమెను అభినందిస్తుంది. గర్భధారణ సమయంలోగాని, ప్రసూతి సందర్భంగా కాని ఆమెకు కలిగే కొద్దిపాటి ఇబ్బందిని, చికాకును సాకుగా తీసుకొని ఆమెకు అన్యాయం చేయదు. ఆ సమయంలో ఆమెకు అండగా నిలబడాలని పురుషుడిని ఉద్బోధిస్తుంది. ఇంటిపని, పిల్లలపెంపకం ఆమెకు మాత్రమే కేటాయించడం అక్రమమని వాదిస్తుంది. స్త్రీ పురుషుల మేధా సంపత్తిలో తేడాలు, వ్యత్యాసాలు లేవని స్త్రీ పురుషునితో సమదీటుగా వ్యవహరించగలదని చెప్తుంది. స్వేచ్ఛ సమగ్రమూ, సంపూర్ణమూ కావాలని అంటుంది. స్త్రీకి సామాజిక స్వేచ్ఛ ఉన్నంతమాత్రాన చాలదు. అలాగే ఆర్థిక స్వేచ్ఛ లభించినంతమాత్రాన ఒరిగేది లేదు. రాజకీయ సాంస్కృతిక స్వేచ్ఛలూ అవసరమే. అన్నీ ఉన్నా లైంగిక స్వేచ్ఛ లేకపోతే ఆమె పురుషుని దాసినే. ఒక రంగంలో

స్వేచ్ఛను అనుభవిస్తూ మరొక రంగంలో ఏ వ్యక్తీ కట్టుబానిసగా ఉండలేదు; ఉండ లేడు. ఈ సత్యాన్ని గుర్తించి, సామాజిక వ్యవస్థయొక్క ప్రాధాన్యతనూ, దానిపై నిర్మింపబడిన భావ ప్రపంచాన్ని రెంటినీ సమానంగా పరిగణించి ఏ సమస్యను అయినా అవగాహన చేసుకోడానికి ప్రయత్నించడం అవసరం. ఈ సిద్ధాంతాన్ని సమర్థించేవారు రాడికల్ ఫెమినిస్టుల వలె పురుషద్వేషానికి లోనుకారు. అయితే పురుషాధిపత్యాన్ని ఎదిరిస్తారు; పురుష దురహంకారాన్ని దుయ్యపట్టారు. ఉదారవాద స్త్రీ విమోచనోద్యమకారుల వలె పెట్టుబడిదారీ వ్యవస్థను సమర్థించి ఊరుకోరు. మార్క్సిస్టు ఫెమినిస్టులవలె స్త్రీ విమోచనోద్యమాన్ని ఆర్థిక పోరాటాలకు సామాన్య పోరాటాలకు బలిచేయరు. సోషలిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతాన్ని బలపరిచేవారివలె అధికార కేంద్రీకరణకు తావుఇచ్చే సోషలిస్టు వ్యవస్థకు స్త్రీ విమోచనోద్యమాన్ని అంటకట్టరు. అంటే పురుషాధిపత్యంపై జరిపే పోరాటం, సామాజిక వ్యవస్థ మార్పుకై సాగే ఆందోళన ఏకకాలంలో జరుపుతారు. మార్క్స్, ఫ్రాయిడ్, ఎం.ఎన్. రాయ్ లాంటి మహామేధావుల సిద్ధాంతాలలోని వాస్తవాంశాలను మాత్రం స్వీకరించి జీవితానుభవంతో రంగరించికొని ముందుకు సాగిపోతారు. భవిష్యత్ ప్రపంచంలో కండ బలం కన్న బుద్ధిబలానికి ప్రాధాన్యత ఉన్నదన్న అంశాన్ని గుర్తెరిగి నూతన సమాజ ఆవిర్భావంకోసం భావ విప్లవాన్ని ఆకాంక్షిస్తారు. కేవలం భావాల మార్పువల్ల స్త్రీల సమస్యలు పరిష్కారం కావని వారికీ తెలుసు. కనుకనే భావ విప్లవాన్ని, సామాజిక పరివర్తనా కార్యక్రమాన్ని ఏకకాలంలో సాగిస్తారు. అలా స్త్రీ విమోచనోద్యమాన్ని విప్లవ పంథాను సమన్వయ పరుస్తారు. వారు వర్గపోరాటం పేరుతో స్త్రీ విమోచనోద్యమాన్ని అణచిపెట్టరు. అలాగే సమాజంలోని దోపిడీ పద్ధతులను గుర్తించక స్త్రీ విమోచనోద్యమాన్ని మాత్రం నిర్వహించి తృప్తిపడరు.

మానవాళి శ్రేయస్సు, స్త్రీల స్వేచ్ఛా సంక్షేమాలు ముడిపడి ఉన్నాయని వేరు వేరు కాదని భావిస్తారు. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, కౌటుంబిక, లైంగిక రంగాలన్నింటా స్త్రీ విమోచనకు, స్త్రీ స్వేచ్ఛకు అవరోధకాలు లేకుండా కృషిచేస్తారు. స్త్రీలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేనంతకాలం పురుష ప్రపంచం బానిసత్వంతో క్రుంగక తప్పదని ఈ మానవవాద స్త్రీ విమోచనోద్యమం నొక్కి వక్కాణిస్తుంది; అలాగే స్త్రీలు పురుష దురంహంకారం వల్ల బాధపడుతూ, పురుషాధిపత్యం క్రింద అణగి మణగి ఉండవలసి వచ్చినంత కాలం పురుషులు వ్యాపారస్తుల వల్ల, పరిశ్రమాధిపతుల వల్ల, ఆస్తివంతుల వల్ల పెత్తందారుల వల్ల, అధికార మదాంధు

వల్ల బాధపడక తప్పదని ఘంటాపథంగా చెప్తుంది. స్త్రీ పురుషులిరువురు కలసి అన్ని రకాల అణచివేతకు అన్యాయాలకు వ్యతిరేకంగా పోరాడటానికి అడ్డంకిగా ఉన్న పురుషాధిపత్యాన్ని రూపుమాపవలసిన సమయం ఆసన్నమయిందని హెచ్చరిస్తున్నది. పురుష దురహంకారాన్ని విసర్జించ వలసిన తరుణం వచ్చిందని పురుష ప్రపంచానికి జ్ఞాపకం చేస్తున్నది. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం, సామాజిక న్యాయం ప్రతి ఫలించే సమాజ నిర్మాణానికి మహిళా విముక్తికి, స్త్రీ స్వేచ్ఛకు ఈ సిద్ధాంతం నాంది పలుకు తుంది.

ఈ సిద్ధాంత కాంతి కిరణాల సాయంతో స్త్రీలు తమ ప్రగతి పథాన పయనించ గలరు; శాంతిని, సౌభాగ్యాన్ని సాధించుకోగలరు. స్వేచ్ఛను, స్వాతంత్రాన్ని పొంద గలరు. తామూ మానవ వ్యక్తులుగా పుండాగా, స్వావలంబులై పురుషులతో సమ ఉజ్జీలుగా వ్యవహరించగలరు. మానవాళికి సుఖ శాంతులను, సంక్షేమాన్ని ప్రసాదించ గలరు.



# II. ఇతర సిద్ధాంతాల లోపాలు

స్త్రీ విమోచన సిద్ధాంతాలు అనేకం ప్రచారంలో ఉన్నాయి. మళ్ళీ కొత్త సిద్ధాంతానికి అవసరమేమిటి అనే ప్రశ్న సహజంగా ఉదయిస్తుంది. స్త్రీల సమస్యలు పరిష్కారానికి ఇంకా అందుబాటులోకి రాలేదు. అదీగాక మానవ విజ్ఞాన పరిధి పెరుగుతున్నది. జ్ఞాన భాండాగారం వృద్ధి పొందుతున్నది. అలాంటి పరిస్థితిలో ఏనాటి జ్ఞానంతోనో సూచింపబడిన సూత్రాలు, పరిష్కార మార్గాలు ఉపకరించవు. కనుక నూతన పంథాలను అన్వేషించటం అవశ్య కర్తవ్యం. పాత సిద్ధాంతాలు ఎందుకూ పనికిరావని కాదు. అవి ఆనాడు విప్లవాత్మకమే, ఉపయోగకరమే. కాగా నూతన పరిస్థితులు ఉద్భవించిన తర్వాత నవ్యజ్ఞానం అవతరించిన తర్వాత నూతన సిద్ధాంతాలు అవసరమవుతాయి అంతే.

పురుషుడు స్త్రీని అణచివేయటం ఎప్పటినుండి ప్రారంభమయింది అని ప్రశ్నిస్తే పలువురు పలు విధాలుగా ఆ దశను నిర్ధారించారు. నాగలితో వ్యవసాయం ప్రారంభమయినప్పటినుండీ అసమానత్వం ఆరంభమయిందని కొందరు, పశుపాలన దశలోనే పని విభజన స్త్రీ పురుషుల మధ్య మొదలయి అసమానత్వం ఉద్భవిల్లిందని మరి కొందరు వేరువేరు సిద్ధాంతాలు ప్రతిపాదించారు. పని విభజన—ఇంటిపని, ఇంటి వెలుపలి పని అని—జరిగిందని కొందరి భావం. ఇంటిలో పని మరి స్త్రీకి ఎందుకు కేటాయించవలసి వచ్చింది. గర్భధారణ, మాతృత్వం ఈ రెండూ స్త్రీయొక్క పరిస్థితిని క్రుంగతీసాయని వారిభావం. గర్భధారణ కాలంలో, ప్రసవ సమయంలో స్త్రీకి విశ్రాంతి అవసరం కనుక ఆమెను ఇంటిపట్టున ఉంచ తలచటం అన్యాయం కాదని భావం అయితే ఆమెను ఎల్లవేళల ఇంటిలోనే ఉండాలని ఏర్పాటుచేయటం, ఇంటి పనులను అన్నింటిని ఆమెకు కేటాయించడం ఎంతవరకు సమంజసం అనే ప్రశ్న ఉదయిస్తున్నది. ఇక్కడ కొన్ని ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి. జంతుజాలంలోను, మానవజాతిలోనూ మాతృత్వం కనబడుతోంది. మాతృత్వం అనేది మానవజాతి ప్రత్యేకత కాదు, కనుక మాతృత్వం సందర్భంగా స్త్రీ పురుష పని విభజన జరిగిందని లేక స్త్రీని ఇంటిపట్టున ఉంచదలచడం సంభవించిందని భావించటం పొరపాటు.

మరొకవాదన గురించి ఆలోచిద్దాం. పురుషుడు కేవలం దేహబలంతో స్త్రీని లొంగతీసుకున్నాడనేది దాని సారాంశము. ఇది వందల సంవత్సరాలలో జరిగిన పరిణామం కాదు. వేల సంవత్సరాలు స్త్రీలు పురుషుల అణచివేతకు ఎదురుఒడ్డి నిలిచారని చివరకు గత్యంతరంలేక లొంగిపోయారని ఆ వాదని ప్రధానాంశం. జంతువులలో పురుష జాతి ఆధిక్యత కనుపడదే! మరి మానవులలో ఎందుకు వచ్చింది? మానవ జాతి జంతుజాతి నుండి పరిణామక్రమంలో ఉద్భవించిందే కదా! మగ జంతువుకు ఆడ జంతువుపై ఆధిక్యత లేదుగదా! మరి మానవులలో మగవారికి ఆడవారిపై ఆధిక్యత ఎలావచ్చింది? దీనికి ఈ వాదనలో సమాధానం కన్పించదు.

ధైర్యం, సాహసం పురుష సింహము కన్న ఆడ సింహానికే ఎక్కువని శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. వేటలో స్త్రీజాతి జంతువులు చొరవను, ఉత్సాహాన్ని, సాహసాన్ని, పట్టుదలను చూపిస్తాయని జంతుశాస్త్రజ్ఞులు చెప్తున్నారు. కనుక ఆధిక్యత ఎలావచ్చింది మానవజాతిలో? మానవజాతి తొలిదశలో మానవులకు జంతుప్రవృత్తి హెచ్చుగా వుండేదని అంగీకరిస్తున్నారు కదా! కనుక ఆడ జంతువుకు లేని న్యూనత మానవునిలో స్త్రీకి ఎలా కలిగింది అని ప్రశ్నిస్తే దానికి సరియైన సమాధానం పురుషుని పశుబలాధిక్యతలో కన్పించదు

ఇటీవల సరిక్రొత్త సిద్ధాంతం వచ్చింది. స్త్రీ సుఖపడే నిమిత్తం తనంతట తాను పురుషునికి లొంగినట్లు నటించి, ఇంటిపట్టున ఉండటానికి ఇష్టపడి ఇంటిబయట తను చేయవలసిన శ్రమను తప్పించుకొన్నదట. కాని అది అలవాటుగా మారిందట, చివరకు నష్టపడిందట. ఈ వాదనకు విప్రతిపత్తులు చాల ఉన్నాయి. ఆనాటి స్త్రీజాతి సమావేశాలు జరిపి నిర్ణయాలు చేసుకున్నదని నమ్మాలంటే అది చాలా విడ్డూరంగా ఉంటుంది. అది ఆనాడు ఆదికాలంలో అసంభవము. ఆనాడు సభలు, సభలలో స్త్రీలు సమిగూడటం, తీర్మానాలు చేయటం అసంబద్ధం. ప్రథమంలో కేవలం ఆచారమే బలంగా ఉండేది. ఆ ఆచారం ఒకనాడు ఏర్పడిందికాదు. వేల సంవత్సరాల మానవ ప్రవర్తనలో ఉద్భవించింది. కనుక స్త్రీలు వ్యూహ విధానంగా, ఎత్తుగడ పద్ధతిగా, జిత్తులమారిగా శ్రమ తప్పించుకోటానికి భార్యలుగా ఉంటామని నిర్ణయించుకున్నారనడం సహేతుకం కాదు.

ఎప్పుడయితే స్త్రీని ఇంటికి పురుషుడు పరిమితం చేశాడో, ఏనాడు ఆమెను ఇంటిలో వదలి తను పొలాల్లో, తోటల్లో, పక్కలో, అడవుల్లో పనిచేయటానికి బయటి

కెళ్ళాడో, ఎప్పుడయితే ఆ స్తికి ఆతడు హక్కుదారుడయ్యాడో, ఎప్పుడయితే ఆమెకు కల్గే సంతానం తనవల్ల మాత్రమే కల్గే సంతానం కావాలని అభిలషించాడో ఆనాడు స్త్రీపై ఆంక్షలు విధించపూనాడు అనేది ఒక పద్ధతి వాదన. ఈ వాదన వినడానికి సొంపుగాఉన్నా, మానసిక తత్వాన్ని విశదీకరిస్తున్నా వాస్తవం కాదు. దీనికి అలాంటి ఆధారాలు లేవు. ఆమెను తనతోపాటు శ్రమ చేయనీయ దలచ లేదట,ఆమెను సుఖపెట్ట దలచాడట. స్త్రీ పురుష సంపర్కం వలన సంతానం కలుగుతుందనే ఆలోచన ఆదిమ మానవునికి లేదు. అదంతా, అంటే స్త్రీ సంతానాన్ని పొందడం స్త్రీయొక్క అద్భుత శక్తి వలన జరుగుతుందని భావించాడు. తరువాత, తరువాత సంతానోత్పత్తిలో పురుషునికి కూడా భాగమున్నదని ఏనాడు గ్రహించాడో ఆనాడు కూడా తన భార్య పర పురుష సాంగత్యంపై నిషేదాజ్ఞలు జారీచేయలేదు. భారతకాలంలో, పురాణ యుగంలో పరాయి పురుషునివల్ల తన భార్యకు కలిగిన సంతానాన్ని తన సంతానంగా భావించాడు పురుషుడు. క్షేత్రజునికి తగు హోదా ఇవ్వటం జరిగింది. అతనికి తన ఆస్తిలో వాటా ఇవ్వటం సంభవించింది. ఈ పరిణామం సమాజపు పశుపాలన దశలో కాని, వ్యవసాయదశలో కాని ఆగిపోలేదు. కొనసాగింది. కాబట్టి ఏనాడు పురుషుడు స్త్రీచేత పొలాల్లో, ఆడవులలో, బీళ్ళలో పనిచేయించటం మానివేశాడో ఆనాడు అతనికి ఔరస సంతానంపై మోజు పుట్టిందని చెప్పటం అసంబద్ధం. అదీగాక స్త్రీలు వ్యవసాయ రంగంలో పొలాల్లో పనిచేయటం మానలేదు. కాకపోతే నాగలి వ్యవసాయం చేయక పోవచ్చును. కాని వారు గుంటక తోలుతున్నారు. విత్తనాలు వెదజల్లుతున్నారు. కలుపు మొక్కలు తీస్తున్నారు, నాట్లు వేస్తున్నారు, పైరు కోస్తున్నారు. వారు పొలాల్లో పని చేయటం మానిందెప్పుడు? ఆ మాటకు వస్తే పశుసంపద తక్కువగా ఉన్న చైనా లాంటి దేశాలలో స్త్రీలు పశువులకు బదులుగా నాగలిని లాగేవారు. ఇది ఇంట్లోఉం చేసే పనికాదు కదా! పురుషుడు ఆమెను అనుమానించటానికి అవకాశం ఏది? ఇలాంటి వాస్తవాలను మరచిపోయి సిద్ధాంతాలను నిర్మిస్తే అవి ఆధార రహితమవుతాయని వే చెప్ప పనిలేదు.

స్త్రీ పురుషుల లైంగికతలో తేడా ఉందని తద్వారా పురుషాధిక్యత ఉద్భవి చిందని కొందరు సిద్ధాంతరీకరిస్తున్నారు. పైకి ఇది వాస్తవంగా కన్పడుతున్నది. కా ఈనాటి పరిస్థితులను ఆధారం చేసుకొని ఆనాడు, అంటే ఆదిమ మానవ సమాజంలో అలా జరిగి ఉంటుందని ఊహించటం సరికాదు.

ఈనాడు స్త్రీలలో లైంగికత ప్రస్ఫుటం కానిమాట నిజమే. పురుషుల లైంగికత కొట్టి వచ్చినట్లు కన్పించడం సత్యమే. అయితే అది ఎందువల్ల వచ్చింది? సమాజంలో స్త్రీ పురుషుని అధీనంలో ఉండడంవల్ల, సమాజంలో పురుషాధిక్యత విలయతాండవం చేస్తున్నందువల్ల ఆమె తన లైంగిక వాంఛలను వెలార్చలేదు; పురుషునికి తెలియ చెప్పలేదు. పురుషుడు తన సాంగత్యాన్ని అభిలషించినప్పుడు ఆమె స్పందించటమేకాని ఆమె తన లైంగిక భావాలను అతనికి ఎరుక పరచటం జరగలేదు. ఇదంతా పురుషాధిక్యఫలితమే. కాగా ఆమె లైంగికత బహిర్గతం కావటం లేదు కనుక ఆమెకు లైంగిక వాంఛలు లేవని తీర్మానించటం తప్పు. అణగారిన స్త్రీ తన లైంగికతను అణగార్చుకోవటం అలవరుచుకున్నది. ఆ అలవాటు ఆమె స్వభావాన్ని మలచింది. ఈనాటి ఆమె స్వభావం అలనాటి ఆమె న్యూనతాస్థితి ఫలితం కాక మరేమీకాదు; అది సమాజ స్వభావంవల్ల ఉత్పన్నమైన అంశం. విషయాన్ని తలక్రిందుగాచేసి వాదించ పూనటం యుక్తి యుక్తం కాదు.

స్త్రీకన్న ఈనాడు కూడా పురుషుడు బలవంతుడు కనుక అతడు అధికుడు అనేమాట వినిపిస్తుంది తరుచుగా. ఇందులో రెండుమూడు అంశాలున్నాయి? పురుషుడు స్త్రీకన్న బలవంతుడే. అయితే ప్రతి పురుషుడు ప్రతి స్త్రీకన్న బలవంతుడుకాదు. కండలు తిరిగిన బలశాలురైన స్త్రీలున్నారు; ఊగిఊగిపోతూ గాలికి కొట్టుకొని పోతారేమోనన్నట్లు బలహీనులైన పురుషులున్నారు. శ్రామిక స్త్రీలకన్న మధ్యతరగతి పురుషులు, సుఖజీవితానికి దాసులైన సంపన్నగృహస్థులైన పురుషులు అధిక శక్తివంతులు కారు. అయినా ఇది దరహంమీద చెప్పేమాట. ఏదైనా వాదనకోసం ఈ మాటను ఒప్పుకుందాము. ఇది ఇలా ఎందుకు జరిగింది. సమాజంలో పై వర్గాలవారి భావాలు సమాజపు భావాలుగా చలామణీ అవుతాయి. సంపన్నవర్గాలలో స్త్రీలు శ్రమచేయరు కనుక వారు వారి వర్గపు పురుషుల కన్నా బలహీనులనేది పచ్చి నిజం. దాంతో స్త్రీని కోమలాంగిగా అభివర్ణించటం జరిగింది. ఇది ఒక రకంగా ఆ వర్గపు స్త్రీలకు లాభదాయకం కనుక, వెసులుబాటు కనుక వారు అంగీకరించి మిన్నకున్నారు. దాంతో ఆ భావం ప్రబలమయింది. అలవాటుగా దేహాన్ని శ్రమపెట్టకపోతే శ్రమ చేసే శక్తిని అది కోల్పోతుంది; తద్వారా బలహీనమవుతుంది. అదే జరిగింది స్త్రీలపట్ల. ఈ భావం ఒకసారి ఉద్భవించిన తర్వాత శ్రామికవర్గంలోకి కూడ ఇది ప్రాకింది. బరువు ఎత్తే పని నీవు చేయలేవని, తన స్త్రీకి చెప్పి తానే చేయగలననే ధీమాతో తానే చేయడం సాగించి, ఆమెను బలహీనురాలిగా చిత్రించాడు శ్రామిక పురుషుడు కూడా. ఇది

సమావేశాలద్వారా పురుష ప్రపంచం సాగించిన దుష్కార్యం కాదు. వేల సంవత్సరాల ప్రవర్తనద్వారా, ఆచారంద్వారా రూఢి అయిన పని. అందువల్ల పురుషులు స్త్రీలకన్న బలవంతులు అనే నానుడి పుట్టింది. నిజానికి పురుషునికన్నా స్త్రీకో వ్యాధినిరోధక సత్తా పదిశాతం ఎక్కువ. మధ్యవయస్సులో కాని, చిన్నతనంలోకాని భర్తను కోల్పోయిన స్త్రీలు అలాంటి దశలో ఉన్న పురుషులకన్న ఎక్కువ కాలం జీవించడం మనం చూస్తున్నాం. ఈ అంశానికి ఇతరత్రా సమాధానం చెప్పవలను పడదు.

ఇంతకూ పురుషులకు స్త్రీలకన్న దేహదార్ఢ్యత ఎక్కువ అని అంగీకరించినా ఆ అంశం ఏమి రుజువుచేస్తుంది? మానవుడు బుద్ధిజీవి. మేధాశక్తి అతని ప్రత్యేక లక్షణం. సాధన నిర్మాణం, పనిముట్ల తయారీ అతని విశిష్ట శక్తిని రుజువుచేస్తున్నది. అలాంటప్పుడు పశుబలం ఏమి పని చేస్తుంది? మీట నొక్కి వేలమైళ్ళ దూరాన ఉన్న లక్ష్యాలను కొట్టగల శక్తిని పొందిన ఈ రోజుల్లో, పిస్టలు, రివాల్వరు సాయంతో ఎంత బలవంతుడనయినా చిత్తుచేసి హతునిచేయగల స్థితిలో దేహబలాన్ని గురించి గొప్పలు చెప్పుకోవటం, గప్పాలు కొట్టటం అవివేకం కాదా? ఇలాంటి పనికిమాలిన వాదనలను పురుషులు విడనాడటం అవశ్యం జరుగవలసిన పని. తెలియనివారు వాదనలో నిలవక పోయినా పిడివాదానికి దిగుతారు. బలవంతురాలైన స్త్రీ బలహీనుడైన పురుషునికి ఎందుకు లొంగిపోవలసి వస్తున్నదని ధీమాగా సవాలుచేస్తూ మాట్లాడుతారు వారు. పురుషాధిక్య సమాజంలోని స్త్రీలుకూడ పురుషాధిక్యతను అంగీకరిస్తున్నారు. దాంతో వారిలో నైతిక ధృతి, మనస్థైర్యం లోపిస్తున్నాయి. వారిలో ధైర్యం నశిస్తున్నది. దుందుడుకు ప్రవర్తనకు అలవాటుపడిన గూండాను, రౌడీని, ఆకతాయి పురుషుని చూచి వారు దిగాలుపడుతున్నారు. ఈ పరిస్థితిని సావకాశంగా తీసుకొని దుష్ట ప్రవృత్తికల పురుషులు పెచ్చుపెరిగిపోతున్నారు. ఘాతుకాలకు తలపడుతున్నారు. స్త్రీలకు మానసిక స్థయిర్యలేమి నిగ్రహించక, వారు పురుషులకన్న తక్కువవారని వాదించపూనటం హాస్యాస్పదం.

స్త్రీ పురుషుల దేహ నిర్మాణ విధానాల్లో తేడాలున్నందువల్ల సహజంగా పురుషాధిక్యతకు తావు ఏర్పడిందని చాలమంది పురుషపుంగవులు వాదించటం కద్దు. ఆధిక్యత విషయం గట్టిగా ఆలోచిస్తే స్త్రీలే అధికులు. పురుషులు చేయలేని పనిని అంటే గర్భధారణను, ప్రసవాన్ని వారు నిర్వహిస్తున్నారు. సమాజాభివృద్ధికి దోహదం

చేస్తున్నారు. మానవజాతి పెంపుదలకు సాయపడుతున్నారు. ఇది పురుషులకు అలవి కాని పని. మరి ఎందుకో వారు అధికులమని విర్రవీగటం? వాదనకో పసలేని మొండి వాదనకు దిగుతారు కొందరు పురుషులు. తమ దేహభాగమైన పురుష జననేంద్రియం తమకు స్వేచ్ఛను కలుగజేస్తున్నదట, స్త్రీల మర్మావయవం వారికి పరాధీనతను కలుగజేస్తుందట. స్థూలంగా చూస్తే ఇది నిజంగా కన్పడుతుంది. స్త్రీ పురుషుల సంపర్కంలో ఇద్దరికి సహకారం లేనిది ఎవరికీ సుఖం లేదనేది నగ్నసత్యం. ఎవరు అధికులు, ఎవరు అల్పులు అనేది అలవాట్లను బట్టి నిర్ణయమవుతుంది. అదీగాక సుఖ ప్రాప్తికి కేవలం స్త్రీపురుషుల సంయోగం విధిగా అవసరం లేదనేది తేలిపోయింది. నూతన పరిశోధనలు ఈ అంశాన్ని రుజువుచేస్తున్నాయి. అదీగాక జన్మ నిగ్రహ సాధనాల వ్యాప్తి, వాడకం పెరిగిన తర్వాత స్త్రీలకున్న ఇబ్బందులు, ఇక్కట్లు చాలవరకు తొలగిపోయాయి. సిజేరియను ఆపరేషను ద్వారా సంతానాన్ని తల్లి గర్భం నుండి వెలికి తీయగల్గటంవల్ల ప్రసవవేదనా భారం తగ్గింది. కష్టం లేకుండా ప్రస వించటానికి అనువైన సూదిమందులు, సమ్మోహనిద్రను కల్పించి శ్రమను తెలియ కుండా చేసే ప్రక్రియలు (Hynotism) స్త్రీ ప్రసవశ్రమను తగ్గించాయి. ఇలాంటి ఈ రోజుల్లో ఇలాంటి మొండివాదనల ద్వారా పురుషాధిక్యతను రుజువుచేయపూనటం నిజంగా సాహసం.

స్త్రీ మెదడు పురుషుని మెదడుకన్నా చిన్నదని ఒక వాదన. పురుషుని మెదడు బరువుకు అతని శరీరభారానికి ఉన్న నిష్పత్తికన్న స్త్రీ మెదడు స్త్రీ శరీరాల బరువుల నిష్పత్తి తక్కువకాదు. అయినా మెదడు పెద్దదిగా ఉన్న ఏనుగు మానవునికన్న గొప్పది కాదుకదా! ఇలా శారీరక నిర్ణయవాదం (Biological determinism) ఎగిరిపోతుంది.

గణితశాస్త్రంలో స్త్రీలు నిష్ణాతులు కాలేకపోతున్నారట. దానికి పురుషులే తగుదురట గణితశాస్త్రం తతిమ్మా శాస్త్రాలకన్న మిన్నకనుక గణితశాస్త్ర అధ్యయ నంలో నిష్ణాతులయిన పురుషులు స్త్రీలకన్న అధికులు ఇది పిరివాదన. చాలకాలం, కొన్ని దశాబ్దాలు స్త్రీలను విద్యకు దూరంగా ఉంచారు. చిన్నచిన్న ఉద్యోగాలకు అనువయిన చదువులను మాత్రమే చదవనిచ్చారు. పేరు ప్రఖ్యాతులుకల విద్యా విభా గాలను వారికి అందుబాటులో లేకుండా చేసింది పురుషాధిక్యతా సమాజం. దానితో చరిత్ర, మానసిక శాస్త్రంలాంటి విద్యా విభాగాలను చేపట్టారు స్త్రీలు. ఇది వారికి

అలవాటయింది. లెక్కలు కష్టమని, వివాహమయితే చదువు మానివేయవలసి వస్తుం దని, తేలికగా డిగ్రీలు సంపాదించుకునే విషయాలను అధ్యయనం చేయమని వారికి సలహాలు ఇవ్వబడినాయి. నమ్మి విద్యార్థినులు అలా చేసారు. ఇటీవలి పరిస్థితిమారింది స్త్రీలు గణితశాస్త్రం, ఇంజనీరింగు, సాంకేతికశాస్త్రం ఇత్యాది విద్యా విషయాలను చేపట్టి ప్రతిభావంతంగా అధ్యయనం చేస్తున్నారు. కనుక ఈ వాదన వీగిపోతున్నది గణితం, దానిలాంటి శాస్త్రాలలో స్త్రీలు ప్రతిభను ప్రదర్శించలేదనేది పురుషాధిక్యతా సమాజం పెంచి పోషించిన భావమేకాని మరేమీకాదు. ప్రకృతి స్త్రీ పురుషుల మానసిక శక్తుల మధ్య తేడా కల్పించిందనే వాదనను పురుషులు డార్విన్ సిద్ధాంతాల వక్రీకరణ ద్వారా సమర్థిస్తున్నారు. సామాజికంగా స్త్రీలను వేర్పాటుకు లోనుచేయడంవల్లనూ వారిని అన్యాయాలకు, ఆక్రమాలకు, దోపిడీకి గురిచేయడంవల్లనూ స్త్రీల మానసిక శక్తి పురుషుని మానసిక శక్తికన్న తక్కువదిగా కన్పడుతున్నది. అంతేకాని వస్తుతః ఆధిక్యత, న్యూనత లేవు. నిజానికి స్త్రీల అంతఃకరణశక్తి పురుషుల దానికన్న గొప్పది. ఈ సామాజిక పరిణామవాదం అర్థరహితం. ఒకవేళ ప్రకృతిపరంగా పురుషశక్తి అధికమయినదని అంగీకరించినా, ప్రకృతిని తనకనుకూలంగా మార్చు కుంటున్న, మార్చుకోగల మానవజాతి పరంగా లైంగిక వరణ సిద్ధాంతాన్ని అంటి పెట్టుకోవలసిన అవసరంలేదు. జనాభా విపరీతంగా పెరుగుతుందని ఘోషించే ఈ రోజుల్లో, బహుసంతాన ప్రాప్తిని కలుగజేయటం గొప్పశక్తిగా, ఆధిక్యతగా పేర్కొ నటం ఆలోచనా రహితమయిన పని.

## సామాజిక జీవశాస్త్ర సిద్ధాంతం (Social Biology)

ఈ సిద్ధాంతం ప్రకారం స్త్రీ పురుషుల మధ్య పోటీ ఉంటుందట. సాధ్యమైనంత మంది స్త్రీలతో పొందు కలుగజేసుకొని ఎక్కువ మంది సంతానాన్ని కనాలని పురుషుడు వాంచిస్తాడట. గర్భధారణ, ప్రసూతిలాంటి విషయాలలో ఎక్కువశక్తిని వినియోగిస్తున్న స్త్రీ పురుషుడి శ్రమను, శక్తిని ఆసరాగా కోరుకుంటుందట. ఇలా స్త్రీ పురుషులు ఒకరినొకరు వాడుకోచూస్తారట. తమ పిల్లలకు తనే తండ్రినని నిర్ధా రణ కోసం స్త్రీని పురుషుడు తన స్వంతం చేసుకుంటాడట. ఇలా స్త్రీ పురుషులు పోటీ పడతారట. ఈ సిద్ధాంతం అనుభవానికి దూరం. సమాజంలో సహకారం, పోటీ ఏక కాలంలో సహజీవనం చేస్తున్నాయి. అలాగే సామరస్యం, సంఘర్షణ మిక్కుటంగా కనపడతాయి. దౌర్జన్యం, దురాక్రమణ పురుషుల స్వాభావిక లక్షణాలని అందువల్ల

పురుషులు సమాజంపై పెత్తనంచేయటానికి అర్హులని ఈ సిద్ధాంత కర్తల అభిప్రాయం. పురుషులలో "టెస్టాస్టోరిన్" హార్మోను ఎక్కువగా ఉండడంవల్ల పురుష స్వభావం అలా ఉన్నదని వాదన చేస్తున్నారు. దీనికి జవాబుగా పురుషాధిక్యత ప్రదర్శనవల్లనే ఈ హార్మోను పెరుగుదల పురుషులలో కన్పడుతున్నదని ప్రతివాదన వచ్చింది. సింహాలు వేటాడేటప్పుడు వ్యూహం పన్ని,ఎత్తులువేసి జంతువుమీద ముందు లంఘించేది ఆడ సింహమని గ్రహించాలి. బాబూన్ కోతులలో మగ కోతిని నాయకుడిగా ఎన్ను కోవడం భౌతిక పరిస్థితులవల్ల జరుగుతున్నది. చారిత్రాత్మక సాంస్కృతిక కారణాల వల్ల పరిస్థితులు మారగలవని గ్రహిస్తే ఈ వాదన నిస్సారమని అవగతం చేసుకోగలం.

## సామాజిక భావ నిర్మాణవాదం(Social Constructionism)

స్త్రీ పురుషుల మధ్య సంబంధాన్ని జీవశాస్త్రం నిర్ణయిస్తుందని, జీవశాస్త్రంయెడ సామాజిక దృక్పథం నిర్ణాయక పాత్ర వహిస్తుందని ఈ సిద్ధాంత సారం. బహిష్టు రక్తాన్ని గురించి, బహిష్టు అయిన స్త్రీయొక్క అపవిత్రతను గురించి పూర్వం అనేక మూఢవిశ్వాసాలు ఉండేవి. ఈ విశ్వాసాలు అనేక మతాలలో చోటుచేసుకున్నాయి. అవి స్త్రీని న్యూనత పరిచాయి. శాస్త్రీయ విజ్ఞానం పెరిగిన తరువాత ఈ అవాస్తవిక భావాలు పటాపంచలవుతున్నాయి. ఈ సిద్ధాంతం సాంస్కృతిక అంశాలకు ఎక్కువ ప్రాధాన్యతను ఇస్తున్నది.

## శారీరక మౌలికసార సిద్ధాంతం (Biological Essentialism)

పుట్టుకతోనే పురుషునికి పురుష స్వభావం, స్త్రీకి స్త్రీ స్వభావం వస్తాయని దీని భావం. పురుషుని మానసిక ప్రవృత్తి స్త్రీ మనసిక ప్రవృత్తి కంటె భిన్నమయినదట. ఇంత వరకు పురుషాధిక్య సమాజలోను, పురుషుని పెత్తనం సాగే వాతావరణంలో స్త్రీలు పెరిగారట. ఇప్పుడు స్త్రీలు చైతన్యవంతులయి స్త్రీత్వం యొక్క గొప్పతనాన్ని గుర్తించారట. గట్టిగా ఆలోచిస్తే ఈ సిద్ధాంతమూ, శారీరక నిర్ణయ సిద్ధాంతమూ బొమ్మా బొరుసూలాంటివని తెలుతుంది. కాగా ఈ సిద్ధాంతాన్ని మహిళోద్యమ కార్య కర్తలు ప్రతిపాదిస్తున్నారు. శారీరక నిర్ణయ వాదాన్ని పురుష దురంహంకారవాదులు ప్రచారం చేస్తున్నారు. కాగా ఈ రెండూ స్త్రీ పురుషుల మధ్య ఉన్న శారీరక విభేదాల ప్రాతిపదికమీదనే ఆధారపడుతున్నాయి.

ఇలా జీవశాస్త్రం, స్త్రీ పురుషుల శరీర నిర్మాణం, స్త్రీ పురుషుల ప్రత్యేక మనస్తత్వాలు సామాజిక జీవశాస్త్రం, సామాజిక పరిణామవాదం వీటిమీద ఆధారపడి నిర్మింపబడిన స్త్రీల అణచివేతకు సంబంధించిన వాదనల లోపాలోపాలను గమనించాం.

ఈనాడు ప్రబలంగా వినపడేవి అయిదు స్త్రీ విమోచన సిద్ధాంతాలు. అవి ఉదారవాద స్త్రీ విమోచన సిద్ధాంతం, మార్క్సిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం, సోషలిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం, రాడికల్ స్త్రీ విమోచన సిద్ధాంతం, సాంస్కృతిక స్త్రీ విమోచన సిద్ధాంతం అనే పేర్లతో అవి చలామణి అవుతున్నాయి. వీటిలో చివరి రెండూ ఒకతెగకు సంబంధించినవి వీటిలో వైవిధ్యం ఉన్నా, మార్గాలు వేరయినా లక్ష్యమూ ధ్యేయమూ ఒకటే. ప్రపంచంలోని స్త్రీ విమోచనోద్యమ కార్యకర్తలు నాలుగు తెగలుగా ఉంటూ అన్నిశాఖల వారూ స్త్రీ విమోచనోద్యమంలో చురుకుగా పనిచేయడం గమనార్హం.

## ఉదారవాద స్త్రీ విమోచన సిద్ధాంతం (Liberal Feminism)

జీవితంయొక్క అన్ని రంగాలలోను అంటే సామాజికార్థిక రాజకీయ సాంస్కృతిక రంగాలన్నింట స్త్రీ పురుషుల మధ్య సమానత్వాన్ని కోరుతుంది ఈ సిద్ధాంతం. మామూలుగా వోటు హక్కు, విద్యా ఉద్యోగ పరిపాలనా ప్రభుత్వ రంగాలలో సమాన స్థాయి ప్రాతినిధ్యం ఆశిస్తారు ఈ సిద్ధాంతాన్ని సమర్థించేవారు. ఇప్పటివరకు పురుషులకు మాత్రమే ప్రవేశార్హత కలిగిన ఉద్యోగాలన్నింటిలో పురుషులతోపాటు పోటీపడమని స్త్రీలను వీరు ఉద్బోధిస్తారు. గర్భస్రావపు హక్కుకోసం వారు ఆందోళన చేస్తారు. కుటుంబ నియంత్రణను ఆమోదించి వారు ఆచరణలో పెడ్తారు. సమాజానికి, పరిసరాలకు ప్రాధాన్యతను ఇచ్చేవారు వీరి వాదనను విమర్శిస్తారు. సామాజిక వ్యవస్థ, లేక సామాజిక వాతావరణం మౌలికంగా మారేవరకు స్త్రీల పురోగతి సాధ్యంకాదని విమర్శకుల భావం. ఉదారవాద స్త్రీ విమోచనోద్యమకారులు సామాజిక వ్యవస్థను మార్చదలచకపోయినా కొంతమేరకు స్త్రీ విమోచనకు వారి కార్యక్రమాలూ, ప్రయత్నాలూ తోడ్పడుతున్నాయి. ఆ మేరకు వారు అభినందనీయులు.

## మార్క్సిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం (Marxist Feminism)

ఈ సిద్ధాంతం కుటుంబంలో జీవశాస్త్రపు పాత్రను అంగీకరిస్తుంది. ఉత్పత్తి

సాధనాల స్వభావంపై సమాజం ఆధారపడుతుందనికూడా చెప్తుంది ఈ వాదం. దీనికి మూలపురుషులు మార్క్సు ఎంగెల్సులు. స్త్రీ పురుషుల మధ్య శారీరక విభేదాలు స్త్రీ పురుషుల పని విభజనకు దారితీశాయని అంటుంది ఈ వాదం. స్త్రీకి గర్భధారణ, ప్రసూతి సహజ ధర్మాలయినందున అవి పురుషాధిపత్యానికి దారితీశాయి. మాతృ స్వామ్య వ్యవస్థ పోయి పితృస్వామ్య వ్యవస్థ వచ్చింది. పారిశ్రామికీకరణ జరిగి, సోషలిజం వచ్చిన తరువాత పురుషాధిపత్యం సమసిపోతుంది అంటుంది మార్క్సిస్టు ఫెమినిజం. ఈ వాదాన్ని సమర్థించేవారు "సోషలిజం వచ్చేవరకు పురుషులపై మీ పోరాటం ఆపండి!" అని స్త్రీలకు విజ్ఞప్తి చేస్తారు. ఆర్థిక స్వాతంత్ర్యంవస్తే దానంతట అదే స్త్రీకి సర్వే సర్వత్రా స్వేచ్ఛ లభిస్తుందని వారి ఆశ. ఈ దృక్పథాన్ని సోషలిస్టు స్త్రీ విమోచనోద్యమకారులూ (Socialist Feminists), ఇతరులూ ఇలా విమర్శిస్తు న్నారు. సోషలిస్టు దేశాలలో పురుషులు పురుష దురహంకారాన్ని విడనాడుతున్న సూచనలు కానరావడంలేదు. పైగా పారిశ్రామిక కార్మికులు తమ స్త్రీలను సమాన హోదా కలవారినిగా చూడటంలేదు.

సనాతన సంప్రదాయ కమ్యూనిస్టులందరూ ఈ సిద్ధాంతాన్ని అంగీకరిస్తూ ఉన్నారు. సృజనాత్మక మార్క్సిస్టులు ఈ వాదాన్ని ఆమోదించటంలేదు ఆచరణలో మావో ఈ వాదాన్ని త్రోసిరాజన్నారు.

ఈ సిద్ధాంతంయెడ విమర్శ ఇలా సాగింది. భౌతిక పరిస్థితులను గమనించ కుండా ఏంగెల్సు మనస్తత్వానికి ప్రాధాన్యత ఇచ్చాడు. స్త్రీ పురుషుల మధ్య పని విభజన జీవశాస్త్ర సంబంధంగా జరుగలేదు శారీరక బలం విషయంగా స్త్రీ పురుషుల మధ్యగల తేడా స్త్రీయొక్క పనిని నిర్ణయించటంలోగాని, ఆమె అసమాన స్థితికిగాని కీలకాంశంగాలేదు. సమాజ పారిశ్రామికీకరణ కాకముందు స్త్రీ ఇంటిలోగాని, పొలంలో గాని బండెడు చాకిరీ చేయక తప్పలేదు, అందుకు ఆమె శారీరక బలహీనత అడ్డు రాలేదు. యాంత్రికరణ ప్రవేశించిన స్త్రీలకు ఉద్యోగాలు పోతున్నాయి. మొదటిదెబ్బ వారికి తగులుతున్నది. స్త్రీలకు తక్కువ వేతనాలు లభిస్తున్నందున వారు పురుష పై ఆర్థికంగా ఆధారపడటం తప్పటంలేదు. శ్రామికులలో వారూ సగభాగమున్నా స్త్రీలకు సమానత్వం లభించటంలేదు. స్త్రీల తక్కువ బలాన్ని వారికి తక్కువ వేతనాలు ఇవ్వడానికి కారణంగా చూపిస్తున్నారు.

## సోషలిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం (Socialist Feminism)

మార్క్సిస్టు విమోచనవాదం యొక్క లోపాన్ని వీరు సవరించుకుంటారు. వీరికి ఉదారవాద సిద్ధాంతం సరిపడదు; దానితో వారు తృప్తిపడరు. అలాగే మార్క్సిజాన్ని స్త్రీ విమోచనోద్యమానికిగాని, స్త్రీ విమోచనోద్యమాన్ని మార్క్సిజానికి గాని లొంగిఉండేటట్లు చేయరు సోషలిస్టు స్త్రీ విమోచనోద్యమకారులు. కుటుంబంలో స్త్రీయొక్క ప్రతిపత్తి ఉత్పత్తి సాధనాల స్థితిగతులతో సరాసరి ముడిపడి ఉండకుండా సాపేక్షంగా 'స్వతంత్రంగా నిర్ణయింపబడుతుందని వీరి వాదన. లైంగిక అసమానత్వానికి ఆర్థికత ముఖ్యకారణమని వీరు అంగీకరించరు. కాగా వీరిలో చాలమంది మార్క్సిస్టు బంధాలను విడలేకుండా ఉన్నారు.

## రాడికల్ స్త్రీ విమోచనోద్యమం (Radical feminism)

ఉదారవాద స్త్రీ విమోచనోద్యమకారులూ, మార్క్సిస్టు స్త్రీ విమోచనోద్యమ కారులూ శారీరకాంశాలకన్న సామాజికాంశాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు. రాడికల్ స్త్రీ విమోచనోద్యమ సిద్ధాంతంలో జీవశాస్త్రం ఎక్కువ ప్రాధాన్యత వహిస్తుంది. పురుషుని శారీరక బలాధిక్యత, సంతానోత్పత్తి విషయంగా స్త్రీయొక్క పాత్ర ఈ రెండూ స్త్రీని సమాన స్థితికి దూరంచేశాయని వారి విశ్వాసం; స్త్రీ పురుషుల మధ్య వర్గ విభజన, రాజకీయ విభజన ఉన్నాయని వీరి వాదం. స్త్రీల విప్లవం రావాలని వీరి ఆకాంక్ష. స్త్రీ విమోచనకు ద్వితీయ స్థానం ఇచ్చినందుకు మార్క్సిస్టులను వీరు విమర్శిస్తారు. వీరిదృష్టిలో స్త్రీలు ఒకవర్గం. వీరు "శారీరక మౌలికసార సిద్ధాంతంపై ఆధారపడతారు.

## సాంస్కృతిక స్త్రీ విమోచన సిద్ధాంతం (Cultural feminism)

ఈ సిద్ధాంతం రాడికల్ ఫెమినిజానికి చాల దగ్గరగా ఉంటుంది; కాకపోతే కొద్ది తేడాలున్నాయి. ఈ సిద్ధాంతం మహిళా సంస్కృతిని శ్లాఘిస్తుంది. స్త్రీయొక్క సృజనాత్మక శక్తిని, సంతానోత్పాదనలో ఆమె సామర్థ్యాన్ని చూచి పురుషుడు ఈర్ష్యపడు తున్నాడని వీరి అభిప్రాయం, విప్లవ స్త్రీ విమోచన సిద్ధాంతాన్ని ఇది ప్రతిపాదిస్తూ వుంది. సంతానోత్పాదనలో స్త్రీ పాత్రను పురుషుడు మానసికంగా గ్రహించే విధానంపై ఆమె అంగాగీనతనం ప్రత్యక్షంగాగాని పరోక్షంగాగాని ఆధారపడుతుందని వీరి

భావం. ఈ అంశంమీద రాడికల్ ఫెమినిస్టులకూ సాంస్కృతిక ఫెమినిస్టులకూ ఏకీభావమే. స్త్రీ విమోచనకు ప్రధాన శత్రువు పురుషుడేనని వీరి నిర్ణయం. రాడికల్ ఫెమినిస్టు అయిన "ఫైర్‌స్టోన్" పురుషులతో సంపర్కం లేకుండా కృత్రిమ గర్భధారణకు పూనుకోవలసినదని స్త్రీలకు విజ్ఞప్తి చేస్తున్నది. సాంస్కృతిక ఫెమినిస్టు అయిన "రిచ్" అనే ఆమె "సంతానోత్పాదన" గురించి గర్వపడవలసిందని స్త్రీలకు ఉద్బోధిస్తున్నది. ఈ రెండు శాఖలవారూ శారీరక మౌలికసార సిద్ధాంతాన్ని ఆమోదిస్తారు. అంటే స్త్రీకుండే సృజనాత్మకశక్తిని చూచి పురుషజాతి అసూయ జెంది వారిని అణచివేయ పూనుకున్నదని ఈ వాదన ముఖ్యాంశం. పురుషజాతిని "పురుషదురహంకార సూకరాలు" (Male Chauvinist Pigs) అని మెక్సికో ప్రపంచ మహిళాసభలో ఎలుగెత్తి నిందించడం జరిగింది. వీరి సిద్ధాంతంలో ముఖ్యమైనది స్త్రీలకు స్త్రీత్వ లక్షణాలను ప్రకృతి ప్రసాదించిందని, వాటిని పురుషుల మానసిక లక్షణాలకన్నా గొప్పవిగా పరిగణించాలని, అంతగా కాకపోతే సమానముగా, లెక్కలోకి తీసుకోవాలని వీరి విశ్వాసం. "డన్‌బార్" అనే ఆమె సామాజిక విముక్తికి మూలం స్త్రీ విమోచనయే అని ప్రకటించింది. స్త్రీత్వ లక్షణాలు అంటే ఇతరులయెడ శ్రద్ధ, జాగ్రత్త ఆత్మ విశ్వాసం, పోటీలేని మనస్తత్వం, సహకారం, ఐహికతత్వం (Materialsm) ఇవి ప్రపంచానికి ఆవశ్యకమని వీరి భావన.

స్త్రీ విమోచన గురించిన ఈ తాత్విక సిద్ధాంతాలన్నీ అర్ధసత్యాలే; వాటిలో కొంత వాస్తవం ఉన్నది; వాటిని పూర్తిగా అంగీకరించడానికి వీలులేదు. స్త్రీ పురుషునికి లొంగి ఉండటం అనే ఈనాటి వాస్తవానికి శారీరకశాస్త్రం, మానసికశాస్త్రం, సామాజికశాస్త్రం, ఆర్థికశాస్త్రం, సామాజిక పరిణామవాదం, సామాజిక జీవశాస్త్రం, వీటిలో ఏ ఒకటీ సరియైన సంజాయిషీ ఇవ్వలేదు. ఏ ఒక్క అంశాన్నో ఆధారం చేసుకుని దానిని వివరించలేము. రాజకీయం, ఆర్థికం, జీవశాస్త్రం, మానసికశాస్త్రం, సామాజిక భావన అన్నీ స్త్రీలను పురుషులూ, సమాజం దోపిడిచేయటానికి ఉపకరించాయి. కేవలం మార్క్సుగాని, ఫ్రాయిడ్‌గాని స్త్రీల సమస్యలకు పరిష్కార మార్గాలను చూపలేదు. బహుముఖంగా సమస్యను దర్శించవలసి వుంటుంది. సమ్యక్ దృక్పథం నేడు అవసరం. ఏదో ఒక సిద్ధాంతాన్ని ముందుగా ఊహించుకుని తద్వారా పరిష్కారమార్గాన్ని అన్వేషించపూనడం అవివేకం; అలాంటి ప్రయత్నం నిష్ఫలం అవుతుంది. మానవ వ్యక్తి సంక్లిష్టజీవి. మానవ స్వభావాన్ని లేక పెరుగుదల

క్రమాన్ని అవగాహన చేసుకోవాలంటే గాఢంగా, సునిశితంగా, విశ్లేషణాయుతంగా పరిశీలన అవసరం; అదీ మానవవాద ప్రాతిపదికపై జరగాలి. ఈ అంశంపై శాస్త్రీయ భావనను, శాస్త్రీయ దృష్టిని ప్రసరింపచేయాలి. అలాంటి ప్రయత్నానికి మానవవాద దృక్పథంతో కూడిన స్త్రీ విమోచన సిద్ధాంతం ఉపకరించవచ్చును.

మహిళా వికాసానికి

# మల్లాది సుబ్బమ్మ సాహిత్యం

| | | | |
|---|---|---|---|
| చరిత్ర | 1. | ఆం.ప్ర. మహిళోద్యమం (1860-1983) | రు. 25-00 |
| విమర్శనాత్మక | 2. | హైందవం: స్త్రీలు | 25-00 |
| గ్రంధాలు | 3. | ఇస్లాం: స్త్రీలు | 15-00 |
| | 4. | క్రైస్తవం. స్త్రీలు | 12-00 |
| వ్యాస సంపుటాలు | 5. | వనితా లోకం | 12-00 |
| | 6. | మనం: మన సంస్కృతి | 12-00 |
| | 7. | బానిసా కాదు, దేవతా కాదు | 10-00 |
| | 8. | ఏది అశ్లీలం | 12-00 |
| | 9. | వ్యభిచారం ఎవరి నేరం | 15-00 |
| | 10. | బంగారు సంకెళ్ళు | 10-00 |
| | 11. | మహిళా దశాబ్దం | 7-00 |
| | 12. | స్త్రీ విమోచన | 7-50 |
| | 13. | మత ధర్మ శాసనాలు: మహిళలు | 8-00 |
| | 14. | ఓ మహిళా! ముందుకు సాగిపో | 7-00 |
| | 15. | లపై అత్యాచారాలు | 7-00 |
| | 16. | విముక్తి: నూతన సిద్ధాంతం | 6-00 |
| | 17. | AGA OF WOMEN'S STRUGGLE | 10-00 |
| | 18. | TROCITIES ON WOMEN | 30-00 |
| సంకలనాలు | 19. | వివాహం; నేడు రేపు | 20-00 |
| | 20. | మహిళా వికాసం: శ్రమ, ఉద్యోగం | 15-00 |
| | 21. | అశ్లీలం: అసభ్యత | 15-00 |
| | 22. | వరకట్న విశ్లేషణ | 10-00 |
| | 23. | వివాహం సంతానం కోసమేనా | 10-00 |
| నవలలు | 24. | వంశాకురం | 20-00 |
| | 25. | ప్రేమ + సెక్స్ = నీతి | 17-00 |
| | 26. | కాంతి కిరణాలు | 12-00 |
| | 27. | వెలిగిన జ్యోతి | 12-00 |
| | 28. | చీకటి వెలుగులు | 10-00 |
| | 29. | ఈ దేశం నాదేనా | 5-00 |
| కథలు | 30. | మాతృత్వానికి మరోముడి | 20-00 |
| ESSAYS | 31. | WO EN, TRADITION & CULTURE | 70-00 |
| CRITIQUE | 32. | ISL M & WOMEN | 120-00 |
| | 33. | HIN UISM & WOMEN | 250-00 |

వికాసం, 9, ఎం.ఐ.జి. హెచ్, మెహిదీపట్నం, హైదరాబాద్-500 028

ఫోను 35429





ఫెమినిస్టు

హ్యూమనిస్టు

రేషనలిస్టు

జర్నలిస్టు

## మల్లాది సుబ్బమ్మ

మహిళాభ్యుదయ సంస్థ అధ్యక్షులు
అభ్యుదయ వివాహవేదిక డైరెక్టరు
వైవాహిక సలహాకేంద్ర కార్యదర్శి
స్త్రీ విమోచన శిక్షణా కార్యక్రమ డైరెక్టరు

ఆంధ్రప్రదేశ్ రాడికల్ హ్యూమనిస్టు సంఘాధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ ఉపాధ్యక్షులు

దుర్గాబాయ్ దేశముఖ్ బహుమతి ప్రథమ గ్రహీత
అఖిల భారత మహిళా సంఘం వారిచే సన్మానిత
తెలుగు విశ్వవిద్యాలయం వారిచే సన్మానిత

1958 నుండి బహుగ్రంథ కర్తగా, వక్తగా, ప్రబోధకురాలిగా మహిళాసంక్షేమానికి తన శక్తియుక్తులను, సేవానిరతితో వినియోగిస్తూ స్త్రీ లోకాన్ని కదలించి, కదలగల కదనశీలి.